# భారతీ వైభవం

ప్రాచీనార్వాచీనాంధ్రకవుల శారదాస్తుతి కవితలకు పరిమళ వ్యాఖ్య

రచన

శ్రీ పాతూరి సీతారామాంజనేయులు



ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2008

**BHARATI VAIBHAVAMU**

*By*

**Sri Paturi Sitaramanjaneyulu**



T.T.D. Religious Publications Series No.175

Re-print: 2008

Copies: 1,000

***Published by:***

K.V.Ramanachary I.A.S.
Executive officer,
T.T.Devasthanams,
Tirupati.

***D.T.P. Type Setting***
Editor's Office, T.T.D,Tirupati.

***Printed at***
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# మున్నుడి

సంస్కృతాంధ్ర వాఙ్మయంలో సరస్వతీ ప్రార్థనకు ఒక విశిష్ట స్థానమున్నది వాగ్దేవి, శారద, సరస్వతీ ఇత్యాది నామాలతో విరాజిల్లే ఆ అక్షరమూర్తి సకలవిద్యాస్వరూపిణి. ఆమె తత్వమును తెలుసుకోవడం అనితరసాధ్యం. సరస్వతిని విద్యారంభంలో విద్యార్థులు, కావ్యరచనారంభంలో కవులు స్తుతించటం ప్రాచీన కాలం నుండి వస్తున్న సంప్రదాయం.

విద్యాధనం విశేషంగా పొందటమనేది కేవలం సరస్వతీ దేవి అనుగ్రహంతోనే సాధ్యమౌతుంది. మన ప్రాచీన ఋషులు ఎందరో తత్త్వజ్ఞానంతో అనుష్ఠానం కావించి సరస్వతీదేవి కృపకు పాత్రులైనారు. ఆదికవి వాల్మీకి వేద ప్రతిపాద్య విషయ ప్రతిపాదకమైన రామాయణ కావ్యాన్ని రచించి లౌకిక సారస్వత వాఙ్మయంలో చిరస్థాయిగా నిలిచారు. విద్యావివేకాలకు ఆమె దివ్యతత్వం. ఆమె వేదస్వరూపిణి. అటువంటి సకలవిద్యా స్వరూపిణి అయిన సరస్వతిని ఎవరైతే ఉపాసిస్తారో వారికి సమస్త విజ్ఞానం లభించడమే కాక సకలసిద్ధులు లభిస్తాయి.

తెలుగు కవులలో నన్నయ శ్రీ బమ్మెరపోతన ఎఱ్ఱాప్రెగ్గడ, శ్రీనాథుడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, నన్నెచోడుడు, మారన, అనంతామాత్యుడు, మొల్ల, కూచిమంచి తిమ్మకవి, కంకంటి పాపరాజు, సారంగు తమ్మయ, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు, విశ్వనాథసత్యనారాయణ తదితర మహాకవులు, తమ కావ్యారంభంలో సరస్వతిని స్తుతించటం సంప్రదాయంగా పాటిస్తూ వచ్చారు. వీరందరి రచనలో ఒక్కొక్క విశేషం గోచరిస్తుంది. ఇందులోని చాలా పద్యాల్లో ఆ కావ్య కథావస్తువు ధ్వనించటం లేదా ఆయా కవుల కవితా లక్షణాలు స్ఫురించటం గమనించవచ్చు.

ఈ పుస్తకంలోని అన్ని పద్యాలు ఆణిముత్యాలు అవశ్యపఠనీయాలు. ఈ గ్రంథ పునర్ముద్రణ సాహితీప్రియులకు ఆనందాన్ని కల్గిస్తుందని ఆశిస్తున్నాము.

భూ. కరుణాకరరెడ్డి

( భూమన కరుణాకరరెడ్డి)

అధ్యక్షులు

తి.తి.దే.పాలకమండలి.తిరుపతి.

# ఆముఖం

శ్రీ పాతూరి సీతారామాంజనేయులుగారు వ్రాసిన--"భారతీ వైభవం"- సికిందరాబాదు యువభారతి వారు,1975లో ప్రచురించారు

ఈ గ్రంథంలో-యుగ యుగాంతరాలుగా తెలుగు కవులు చేసిన సరస్వతీ స్తుతులు ఉన్నాయి. రచయిత వ్రాసిన విపుల పీఠికలో సంస్కృత సాహిత్యంలోని సరస్వతీ ప్రార్థనా పరిణామ క్రమవికాసం విస్తరింపబడింది.

రచయిత- ఈ పుస్తకంలోని సరస్వతీ ప్రార్థనా పద్యాలు అన్నింటికీ చక్కటి సప్రకరణ వ్యాఖ్యలు వ్రాశారు.

ఈ పద్యాలు అన్నీ విద్యార్థులకు అవశ్య పఠనీయాలు, ఇవి-అనేక కావ్యాలలోనుండి ఏర్చి కూర్చిన ఆణిముత్యాలే అయినప్పటికి అవి అన్నీ స్వయం సంపూర్ణాలు అయిన చాటువులవంటివే.

అంతేగాక-ప్రతిపద్యం సరస్వతీ ప్రార్థన మాత్రమేగాక ఏ తత్కవియొక్క సాహితీదర్శన ప్రతీక అని చెప్పవచ్చు.

ప్రతిపద్యం విడివిడిగా చదువుకొని ఆరాధించవచ్చు. ఏకైక పద్యము ప్రబంధ శత సమానము అని చెప్పవచ్చు.

లోగడ ప్రజానురంజకమైన ప్రచురణను తిరుమల తిరుపతి దేవస్థానం వారు తీసుకోవటం జరిగింది. ఈ పునర్ముద్రణకుగూడ యథాప్రకారం ప్రజల ఆదరాభిమానాలు లభింపగలవని ఆశించుచున్నాము.

**కె.వి.రమణాచారి,**
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

# భారతీ భావనం



"సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి,
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా."

అని సర్వసాధారణంగా సరస్వతిని ప్రార్థించడం పరిపాటి. అక్షరాభ్యాసం చేయబోయే పిల్లవాండ్లకు ఇది తప్పకుండా మనవాళ్లు నేర్పుతారు. అప్పుడప్పుడే మాటలు వస్తూ ఉన్న పసిపిల్లలకు పెద్దవాళ్లు ముద్దుగా నేర్పే అనేక పద్యాలలో ఇదీ ఒకటి. ఈ శ్లోకంతోపాటుగా

"పద్మపత్ర విశాలాక్షీ పద్మకేసరవర్ణినీ,
నిత్యం పద్మాలయా దేవీ సా మాం పాతు సరస్వతీ."

అనేది మఱియొకటి. ఇవికాక తెలుగుదేశంలో అతిప్రసిద్ధంగా వాడుకలో ఉన్న-

"తల్లీ,నిన్నుదలంచి పుస్తకము చేతన్ బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
పుల్లాబ్జాక్షి, సరస్వతీ, భగవతీ, పూర్ణేందు బింబాననా."

అనేది అందరికీ తెలిసిందే. తెలుగుదేశంలో దసరాపండుగ రోజుల్లో పంతుళ్ళు తమ విద్యార్థులతో కలసి వారివారి తల్లిదండ్రుల ఇండ్లకుపోయి కులాల వారీగా వారి వారిని పొగడే పద్యాలతోపాటు దేవతాస్తోత్రపు పద్యాలూ, పాటలూ పిల్లలచేత పాడిస్తారు. గృహస్థులు భక్తిగౌరవాలతో, యథాశక్తి ఇచ్చిన బహుమతులను స్వీకరిస్తారు. ఇది పరిపాటిగా వస్తూ ఉన్న విషయం. ఈ బహుమతుల్లో విద్యార్థులకుకూడా కొంతభాగం లేకపోలేదు, "అయ్యవారికి చాలు అయిదు వరహాలు, పిల్లవాండ్లకు చాలు పప్పు బెల్లాలు." ఈ సందర్భంలో పిల్లలు పాడే అనేకపద్యాలలో సరస్వతీ ప్రార్థన ఒకటి ఇలా ఉంది.

"సరస్వతి మతి మాకు చాలంగ నిమ్ము
పరమేష్ఠి రాణి మము పాలించ వమ్మ

వల్లకీమృదుపాణి వరనీలవేణి
పల్లవారుణపాణి పరమకల్యాణి
జలజాతభవురాణి సైకతశ్రోణి
అలివేణి శుకవాణి అష్టావధాని
కరుణా కదంబ చక్కని శారదాంబ"

సంస్కృత సాహిత్యమూ, శాస్త్రాలూ చదివే విద్యార్థులు హయగ్రీవ ప్రార్థనగా

"జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే."

అనేది. దక్షిణామూర్తి స్తోత్రంగా

"గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్,
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః."

అనేది పఠిస్తారు. వీటితోపాటే

"శారదా శారదాంభోజవదనా వదనాంబుజే,
సర్వదా సర్వదాస్మాకం సన్నిధి సన్నిధిం క్రియాత్."

"శరదిందువికాసమన్దహాసాం
స్ఫురదిన్దీవరలోచనాభిరామామ్,
అరవిన్దసమానసున్దరాస్యా
మరవిన్దాసన సున్దరీ ముపాసే"

అనే సరస్వతీ ప్రార్థన శ్లోకాలు తమ విద్యాసంసిద్ధి కొఱకు పఠించడం సంప్రదాయంగా వస్తూ ఉన్న విషయం. వేదాధ్యయనానికి, ఉపనిషత్పాఠానికి ముందు పఠించే

"ఓం సహ నావవతు సహనౌభునక్తు; సహ వీర్యం కరవావహై; తేజస్వినావధీతమస్తు; మా విద్విషావహై; ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥"

ఈ అధ్యయనం మమ్ములను-అధ్యాపకుని-అధ్యేతను-ఇద్దరను కాపాడునుగాక! మమ్ములను-ఇద్దరను సుఖము అనుభవింపజేయుగాక! మేమిరువురమును శక్తిని పొందుదుము గాక ! మా అధ్యయనము తేజస్వి అగును గాక! మేమిరువురమును ఒకరి నొకరు ద్వేషింపకుందుము గాక! అనే శాంతిపాఠం మంత్రం కూడా వాక్సిద్ధినీ, విద్యాసిద్ధినీ, జ్ఞానసిద్ధినీ లక్ష్యంగా ఉంచుకొని వాగధిదేవతను ఉద్దేశించి చేసే స్తోత్రం అనే చెప్పవచ్చు. వేదాది సమస్త వాఙ్మయమూ వాగ్రూపమే. వాగధిదేవతయే సరస్వతి గదా !

ఈ విధంగా విద్యాసంసిద్ధిని ఆశించి సరస్వతీ ప్రార్థన చేయటం మన దేశంలో మాత్రమే కాదు, పాశ్చాత్యదేశాల్లోకూడా చాలా ప్రాచీనకాలంనుంచీ ఉంది. గ్రీకు, ల్యాటిన్ సాహిత్యాలలో మినర్వా, మ్యూజ్ మొదలైన రూపాలలో విద్యా, బుద్ధీ, కవితా, సంగీతాలకు అధిదేవతగా సరస్వతిని ప్రార్థించటం పరిపాటిగా ఉన్నది. ల్యాటిన్ మహాకవి అయిన వర్జిల్ తన ఏనీడ్ (Aeneid) అనే కావ్యం ఆరంభంలోMusa(మ్యూజా)ను స్తోత్రం చేసి ఉన్నాడు. ఆంగ్ల మహాకవి మిల్టన్ తాను రచించిన పేరడైజ్ లాస్ట్ కావ్యం మొదట మ్యూజ్‌ను స్తుతించాడు. ఆయన ఆమెనిలా వేడుకుంటాడు.

"what in me is dark,
Illumine, what is low raise and support;
That, to the night of this great argument;
I may assert Eternal Providence
And justify the ways of God to men."

ఇంకా "Heaven hides nothing from thy view,
Nor the deep tract of Hell"

ఈ పంక్తుల్లో అంతటా ఆ మ్యూజ్ అనే దేవతయొక్క శక్తిసామర్థ్యాలు వర్ణితమై ఉన్నై .

సరస్వతిని ఇలా విద్యారంభంలో విద్యార్థులూ, కావ్యరచనారంభంలో కవులూ స్తుతించడం మాత్రమే కాదు, ఆయా సందర్భాలలో ఆమెను యథాశాస్త్రంగా షోడశోపచారాలతోను, అష్టోత్తరశతాదినామావళితోను పూజించడం పరిపాటిగా

ఉంది. అక్షరాభ్యాసంలో ఈ విధంగా సరస్వతీపూజ జరపడం అందరికీ తెలిసిందే. శరన్నవరాత్రాలలో చేయడం సంప్రదాయంగా వస్తూ ఉన్నది. పంచాంగాలలో సరస్వత్యావాహనం సరస్వత్యుద్వాసనం అనీ రెండు రోజులు గుర్తించబడి ఉంటాయి. దీనికి సంబంధించి "మూలేనావాహయేద్దేవీం శ్రవణేన విసర్జయేత్" (మూలానక్షత్రం నాడు సరస్వతీదేవిని ఆవాహన చేయాలి. శ్రవణానక్షత్రం నాడు ఉద్వాసన చేయాలి) అనే కారిక ఒకటి పరంపరలో వినవస్తూ ఉన్నది. అయితే ఈ సందర్భంలో పూజితఅయ్యే అమ్మవారిని మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ, అనే దేవతాత్రయ సమ్మేళనాత్మకంగా గ్రహించడం కనబడుతూనే ఉంది. దేవీపూజా సంప్రదాయంలో ఉన్న ఈ దేవీ స్వరూపవర్ణనను అనుసరించి ఈ మహాసరస్వతి స్వరూపంకూడా మనకు సాధారణంగా వినబడే సరస్వతి ప్రార్థన శ్లోకాలలో పద్యాలలో అభివర్ణించిన స్వరూపంకంటె భిన్నంగా ఉంది.

> "ఘంటాశూలహలాని శంఖముసలే చక్రం ధనుస్సాయకం
> హస్తాబ్జైర్దధతీం ఘనాంత విలసచ్ఛీతాంశుతుల్యప్రభామ్,
> గౌరీదేహసముద్భవాం త్రిజగతా మాధారభూతాం మహా
> పూర్వామత్ర సరస్వతీ మనుభజే శుంభాది దైత్యార్దినీమ్."

ఈ సరస్వతీదేవికి దేవాలయాలు చాల అరుదుగా ఉన్నై. తెలిసినంతలో ఒకటి కాశ్మీరంలోని శారదాపీఠం. ఇక్కడనే మన భారతీయ సంస్కృతికీ సాహిత్యానికీ సంబంధించిన ఉత్తమగ్రంథా లనేకం వ్రాతప్రతులలో భద్రపరచబడి ఉన్నాయి. రెండవ దేవాలయం ఆంధ్రప్రదేశ్‌లోని అదిలాబాదుజిల్లాలో గోదావరీనదీతీరాన ఉన్న వానరక్షేత్రంలో ఉన్నది. ఇదికాక శ్రీశంకరాచార్యులు స్థాపించిన పీఠచతుష్టయంలోనిదైన శ్రీ శృంగేరీపీఠంలోను, దాని ఉపపీఠాల్లోనూ శారదాపూజ ఉన్నది.

అమరసింహుడు సరస్వతిని దేవతగా గ్రహించినట్లులేదు. అమరకోశంలోని స్వర్గవర్గలో శివుడూ, విష్ణువూ, ఇంద్రుడూ వీరి పేర్లు ఉమాపతిః లక్ష్మీపతిః, శచీపతిః అని వారి భార్యలతో కలిపి చెప్పాడు. వేరుగా మళ్ళీ లక్ష్మీ, పార్వతి, శచీదేవుల పేర్లుకూడా పేర్కొన్నాడు. కాని బ్రహ్మదేవుని పేర్లలో ఒకటైనా సరస్వతీనాథుడు అని అర్థం వచ్చేటట్లు చెప్పలేదు. వాగ్వర్గలో

"బ్రాహ్మీ తు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ,
వ్యాహార ఉక్తిర్లపితం భాషితం వచనం వచః" అని చెప్పాడు.

వానిలో మొదటి ఏడూ వాక్కుకూ వాగ్దేవతకుకూడా పేర్లుకాదగినవి. మిగిలిన ఆరూ పలుకులకు మాత్రమే పేర్లు కాదగినవి. భావార్థంలో వ్యుత్పన్నాలు. వీటి నిర్వచనాలు ఇవి. బ్రహ్మకు సంబంధించినది బ్రాహ్మీ; గీః-వాక్-వాణీ అనే పదాలకు పలుకబడినవి అని అర్థం. సరః అంటే సరణం-వ్యాప్తి; వ్యాప్తి కలది కనుక సరస్వతీ; ఒకరినుంచి మరొకరికి ఆకాశాదులద్వారా ఒకచోటినుంచి మరొకచోటికి వ్యాప్తిచెందే స్వభావం కలది. ఇక భారతీ పదం నిశ్చితమైన నిర్వచనం ఈయనీయకుండా సుధావ్యాఖ్యాతను సందేహంలో పడవేసింది. కాని ఒకవిధంగా ఆలోచిస్తే ఈ శబ్దరూపనిష్పత్తి ఈ విధంగా ఊహించవచ్చు. బృంహతీతి- బ్రహ్మ-బృహత్; బృహి వృద్ధౌ; బ్రహ్మణః ఇయం-వేదా-బృహతః ఇయం బార్హతీ. ఇక్కడ రేఫమీదవున్న మహాప్రాణాంశం (హకారం) బకారం మీదకు రాగా భారతీ. కాని విశేషం ఏమంటే సరస్వతీ పదంతోపాటే అధికప్రచారంలో ఉన్న శారదాపదాన్ని అమరసింహుడు ఇక్కడ గ్రహించలేదు. శారదాపదం శరత్ పదంనుంచి నిష్పన్నం. శరదృతువులోని వెన్నెలా, ఆ ఋతువున నదీతీరాలలో విశేషంగా కనబడే కాశకుసుమాలూ, శరన్మేఘశకలాలూ, శరత్తులో మానససరస్సునుండి క్రిందికి దిగి గంగాదినదులలో విహారం కోరి దేశభాగంలోకి వచ్చే రాజహంసలూ -అన్నీ తెల్లనివే. సరస్వతీరూపం తెల్లనిదే. ఇంతే కాదు. శరత్తులోనే నవరాత్రోత్సవాలలో ఆమె ఆరాధన. శరత్తుతో ఈ విధంగా ఆమెకుండే దృఢతమ సంబంధాన్నిబట్టి సరస్వతికి శారద అనే వ్యవహారం ఏర్పడి ఉండవచ్చు.

ఋగ్వేదంలో సరస్వతీపదం నదీపర్యాయంగానూ, వాక్పర్యాయంగానూ ప్రయోగించి ఉంది. "చత్వారి వాక్పరిమితాపదాని"," ప్రణో దేవీ సరస్వతీ" "దేవీం వాచమజనయన్త దేవాః" ఇత్యాది ఋక్కులలో లోకంలో సరస్వతీపదం సర్వసాధారణంగా వాగ్దేవీపరంగా వాడుకలో ఉంది. కేవల వాక్పరంగా పండితులూ, సంస్కారవంతులూ మాత్రమే వాడుతున్నారు. సరస్వతీ పదంనుంచి నిష్పన్నమైన సారస్వతం వాఙ్మయం ఇంచుమించుగా ఒకే అర్థంలో వాడుతున్నారు. కాళిదాస శాకుంతలంలో "సరస్వతీ శ్రుతిమహతీ మహీయతాం" అన్నచోట సరస్వతీ పదాన్ని వాక్కు అనే అర్థంలోనూ, విక్రమోర్వశీయంలో "సంగతం శ్రీసరస్వత్యోః" అన్నచోట వాగధిష్ఠాతృదేవతా అనే అర్థంలోనూ ప్రయోగించాడు. జయదేవుడు గీతగోవింద కావ్యంలో

**"యది హరిస్మరణే సరసం మనో**
**యది విలాసకలాసు కుతూహలమ్,**
**సరసకోమలకాంత పదావళీం**
**శృణు తదా జయదేవ సరస్వతీమ్."**

అనే శ్లోకంలో సరస్వతీ పదాన్ని వాక్కు అనే అర్థంలో ప్రయోగించాడు. తులసీదాసు వాణీ పదాన్ని వాగధిష్ఠాత్రీ పరంగా ప్రయోగించాడు.

**"వర్ణానామర్థసంఘానాం రసానాం ఛన్దసామపి,**
**మంగళానాం చకర్తారౌ వన్దే వాణీ వినాయకౌ."**

మల్లినాథుడు "వాణీం కాణభుజీ మజీగణత్" అని వాణీపదాన్ని వాక్కు అనే అర్థంలో ప్రయోగించాడు. కాళిదాసు మహాకవి భారతీ పదాన్ని అర్థమూ అనే అర్థంలో ప్రయోగించి ఉన్నాడు.

**"తమర్థమివ భారత్యా సుతయా యోక్తు మర్హసి."**

మమ్మటాచార్యుడు భారతీపదాన్ని వాక్కు అనే అర్థంలో ప్రయోగించాడు,"భారతీ కవేర్జయతి". భారతీ అనేది కావ్యాంగాలైన వృత్తులలో ఒకటి.

**"కైశిక్యారభటీ చైవ సాత్వతీ భారతీ తథా,**
**చతస్రో వృత్తయో జ్ఞేయాః రసావస్థానసూచకాః."**

కానీ ఇక్కడ భారతీ పదానికి వాక్పర్యాయమైన భారతీపదంతో సంబంధం లేదేమో అని అనిపిస్తుంది. బ్రాహ్మీదత్త వరప్రసాదుడు అని శ్రీనాథుడు బ్రాహ్మీపదాన్ని వాగధిష్ఠాతృదేవత అనే అర్థంలో ప్రయోగించాడు. భోజుడు ఈ మూడు పదాలను ప్రయోగించి ఉన్నాడు.

"వాల్మీకేర్వదనారవిన్దాచ్ఛన్దోమయీ కాచిదేవం నిస్సార సరస్వతీ." ఇక్కడ సరస్వతి అంటే వాక్కు అని అర్థం.

**"వాణీవిలాసమపరత్ర కృతోపలంభ**
**మంభోజభూరసహమాన ఇవావిరాసీత్."**

ఇక్కడ వాణి అంటే వాగధిష్ఠాత్రి "మధ్యమ లోకేఽపి స్వవృత్తం ప్రకాశయితుం కిల భవన్తమేవోపతిష్ఠమానయా భారత్యా." ఇక్కడ వాక్కు దేవతా

అనే రెండు అర్థాలూ సరిపడతవి. "సారం తు సారస్వతం జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టో మురారిః కవిః" అని మురారి సరస్వతీపదాన్ని వాక్కు అనే అర్థంలో ప్రయోగించాడు.

పురాణాల్లో సరస్వతీ, శివుడూ ఇద్దరూ బ్రహ్మకు అపత్యాలు, కనుక వారిద్దరూ ఒకరికొకరు తోబుట్టువులు, కద్రూజాంగాదుల తోడబుట్టువు అని తెనాలి రామకృష్ణుడు. కాని మన్మథుని ప్రభావానికి లోబడి విధాత ఆమెనే కామించి తనకు ఇల్లాలినిగా చేసికొన్నాడు. "బ్రహ్మదేవు మొగంబు పడతికి పడకిల్లు చేసి పెట్టినయట్టి చేరకాడు" అని శ్రవణానందంలో తిరుపతి వేంకటేశ్వరకవులు అన్నారు. బ్రహ్మ ప్రభుసమ్మితమైన వైదికవాఙ్మయానికి ప్రతీక. సరస్వతి కాన్తా సమ్మితమై సుకుమారమైన లౌకికవాక్కుకూ కవిత్వ నృత్య సంగీతాది లలితకళలకూ ప్రతీక. లౌకికప్రవృత్తికీ ఆనందానికీ సరస్వతీ రూపమూ, పారలౌకిక సుఖప్రాప్తికి ధర్మాచరణానికీ వైదిక వాఙ్మయమూ అత్యావశ్యకాలు. వాటి రెంటి సంబంధం విడదీయరానిది. అందుకనే వారు దంపతులు. వైదిక వాఙ్మయం ప్రాచీనం. లౌకిక వాఙ్మయం దానినుంచి అర్వాచీనంగా నిష్పన్నం. కనుకనే బ్రహ్మకు సరస్వతి అపత్యం.

సరస్వతి విద్యాబుద్ధి వాక్ప్రతిభలకు ప్రతీక. ఆమె అనుగ్రహాన్ని బట్టియే ఇవి జనులకు ఒక్కొక్కరి కొక్కొక్కవిధంగా ఎక్కువ తక్కువ పరిమాణాలల్లో లభిస్తవి. ఇవి అన్నీ నిర్మలస్వరూపాలు. వీటిలో ఏ కొంచెం దోషం ఉన్నా స్పష్టంగా కనబడుతుంది. అందుచేతనే ఆమె

**"చతుర్ముఖ ముఖాంభోజ వనహంసవధూర్మమ,**
**మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ".**

ఆమెకు మనవారు లౌకికమైన రూపం ఇచ్చి సగుణోపాసనలో పూజకు అనుకూల్యం కల్పించారు. ఆమె స్వరూపం కొందరిదృష్టిలో ఈ విధంగా ఉంది.

**"యా కున్దేన్దు తుషార హారధవళా యా శుభ్రవస్త్రాన్వితా**
**యా వీణావరదణ్డమణ్డితకరా యా శ్వేతపద్మాసనా,**
**యా బ్రహ్మాచ్యుత శఙ్కర ప్రభృతిభిర్దేవై స్సదా పూజితా**
**సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా."**

ఆమె అనుగ్రహం ఉంటే జడత్వం-బుద్ధిమాంద్యం నిశ్శేషంగా నశించి ప్రతిభ వికసిస్తుంది. ఆమెకు లౌకికస్వరూపం ఇయ్యడంలో ఒక్కొక్కరు ఒక్కొక్కవిధంగా భావనచేశారు. ఆమెకు ఒకచేతిలో కమండలువు, మరొకచేతిలో అక్షమాలా అని ఒకరు. వీణాపుస్తకధారిణీ అని మరొకరు; అక్షసూత్రాంకుశధరా, పాశపుస్తకధారిణీ అని మరొక భావన-ఇవన్నీ ఆమెకు ఏ యే విషయాలపైన అధికారం కలదో వాటినిబట్టి చేసిన భావన. ఆమె ముఖ్యంగా సంగీత సాహిత్యాలకు అధిష్ఠాత్రి. ఆ రెండు లలితకళలు లౌకిక ప్రవృత్తిలో మానవునికి విశ్రాంతి ధామాలు. కడుపు తాపత్రయానికి నిరంతరంగా ఏదో వ్యాపకంలో మునుగుతూ తేలుతూ విసుగెత్తిపోయే మనుష్యునికి ఎప్పటికప్పుడు కొంత విశ్రాంతినిచ్చి అతడు ముందుకు పోవటానికి అవకాశం కలిగించేవి ఈ రెండును.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్."

అయితే ఈ రెంటిలోనూ సంగీతం వినగానే ఆనందం ఇస్తుంది. దాని అనుభూతికి మెదడుకు శ్రమ ఈయవలసిన పనిలేదు. కవిత్వంలో ఉండే ఆనందం ఆలోచించినమీదట కాని అనుభూతికి రాదు.

"ఏకమాపాత మధురం అన్యదాలోచనామృతమ్".

సరస్వతీ రూపం వలెనే బ్రహ్మదేవుని రూపం కూడా తగినట్లే భావన చేశారు మనవారు. ఆయన వేదవాఙ్మయానికి ప్రతీక, వేదాలు నాలుగు. నాలుగు వేదాలూ ఏకకాలంలో పలకడానికి వీలుగా కాబోలు ఆయనకు నాలుగు ముఖాలు.

**నాలుగు మోములన్ నిగమ నాదము లుప్పతిలన్ బ్రచండ వా**
**తూలహతిన్ జనించు రొదతోడి గుహావళి నొప్పు మేరువుం**
**బోలెఁ బయోజపీఠి మునిముఖ్యులు గొల్వఁగ వాణిఁ గూడి పే**
**రోలగ మున్న ధాత విభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్"**

అని లోక పితామహుని వర్ణించినాడు ఆంధ్రకవితాపితామహుడు. బ్రహ్మ రజోమూర్తి, అరుణవర్ణుడు. సరస్వతి సత్త్వమూర్తి. శుక్లవర్ణ. కాని వారిద్దరికీ వాహనం హంసయే. దీని సమన్వయం ఇలా చెప్పుకోవచ్చు. పాణిని వ్యాకరణంలో ప్రత్యాహారవిధానం ఉంది. దాని ప్రకారం మాహేశ్వర [1] సూత్రాలలో 'అఇఉణ్' లోని 'అ', "ఐఔచ్" సూత్రంలోని "చ్" కలిపి "అచ్" అంటే స్వరాలన్నీ అని అర్థం. "హయవరట్" సూత్రంలోని "హ" "హల్" సూత్రంలోని "ల్" కలిపి

ఉచ్చరిస్తే "హల్" అంటే వ్యంజనాలన్నీ అవుతవి, వేదంలో "గౌరా" గౌతమదారా పదాన్ని సూచిస్తుందంటారు. అలాగే మాతృకాపాఠంలోని "హ" తో ఆరంభించి "హ,క్ష" అయిన తర్వాత "అఆ" మొదలైనవి తీసికొని చదువుతూ రాగా చివరి అక్షరం "స" అవుతున్నది. ఈ రెంటినీ కలిపితే "హస" అవుతుంది. ఉచ్చారణా సౌకర్యానికి అనుస్వారం చేర్చగా "హంస" అయింది. అంటే పై ప్రత్యాహారపద్ధతి ప్రకారం ఈ హంస పదం. మాతృకా పాఠంలోని అన్ని వర్ణాలను చెబుతుంది. వైదిక´లౌకికి వాఙ్మయాని కంతటికీ ఈ వర్ణాలే మూలం కనుకనే సరస్వతీ బ్రహ్మలు హంసవాహనులు. ఇందుకు ప్రమాణం---

"నిరంతర మజపా హంస ఇత్యేవ మాతృకా పంచాశద్వర్ణ
నిగ్రహేణాకారాది క్షకారాన్తేన వ్యాప్తాని భువనాని శాస్త్రాణి
ఛన్దాంసీత్యేవం భగవతీ సర్వం వ్యాప్నోత్యేవ"

అని త్రిపురాతాపిన్యుపనిషత్.

"సర్వదేహస్య మధ్యస్థో హంస ఏవ మహేశ్వరః,
పృథివ్యాది శివాన్తం తు అకారాద్యాశ్చ వర్ణకాః,
కూటాన్తా హంస ఏవ స్యాత్ మాతృకేతి వ్యవస్థితాః,
మాతృకారహితం మన్త్రం అదిశ్యేతే న కుత్రచిత్."

అని బ్రహ్మ విద్యోపనిషత్.

"హంస హంసేత్యముం మన్త్రం జీవో జపతి సర్వదా."

ఈ విధంగా హంసపదం సర్వ వాఙ్మయానికి ప్రతీక. కనుక లౌకిక వైదిక వాఙ్మయమూర్తులైన సరస్వతీ బ్రహ్మలు హంసవాహనులనడం సమంజసమే. ఆ హంస తెల్లనిది కావడంచేత ఈ వాహనకల్పనం వలన సరస్వతియొక్క సర్వశుక్లత్వం మరింత ప్రకాశించ వీలైంది.

అష్టోత్తర శతోపనిషత్తుల్లో సరస్వతీరహస్యోపనిషత్తు ఒకటి. ఋషులు కొందరు ఆశ్వలాయనమహర్షికడకు పోయి

---

1. మహేశ్వర సూత్రాలు: అ ఇ ఉ ణ్, ఋ లు క్. ఏ ఓ ఙ్, ఐ ఔ చ్, హయవరట్,లణ్, ఞమఙణనమ్, ఝభఞ్, ఘఢధష్, జబగడదశ్, ఖఫఛఠథచటతవ్, కపయ్' శషసర్.హల్.

**"కేనోపాయేన తద్జ్ఞానం తత్పదార్థావభాసకం**
**యదుపాసనయా తత్త్వం జానాసి భగవన్ వద"**

అని ప్రశ్నించారు.

**"సరస్వతీ దశశ్లోక్యా సఋచా బీజమిశ్రయా,**
**స్తుత్వా జప్త్వా పరాం సిద్ధిమలభం మునిపుంగవాః."**

అని ఆశ్వలాయనుని సమాధానము. ఈ ఉపనిషత్తులో ఇచ్చిన ఋక్కులు చూడగా ఋగ్వేదంలో సరస్వతికి ఇయ్యబడిన ప్రాముఖ్యం తెలుస్తుంది. వీటిలో కొన్ని యాజుష బ్రామ్మణంలోను, యాస్కుని నిరుక్తంలోను, వ్యారకణ భాష్యంలోనూ ఈయబడినవి. వీటిని యాస్క పతఞ్జలులు వ్యాఖ్యానించి ఉన్నారు. ఈ ఋక్కులలో చక్కని వాక్తత్త్వ వివేచనము ఉన్నది. ఈ ఋక్కులు ఇవి.

"ప్రణోదేవీ సరస్వతీ! వాజేభి ర్వాజినీవతీ। ధీనా మవిత్ర్యవతు" 1

"అనో దివో బృహతః పర్వతా దా। సరస్వతీ యజతాగంతు యజ్ఞమ్
ఇయం దేవీ జుజుషాణా ఘృతాచీ। శగ్మాం నో వాచముశతీ శృణోతు॥" 2

"పాపకానః సరస్వతీ, ర్వాజేభి ర్వాజినీవతీ। యజ్ఞం వష్టు ధియావసుః॥" 3

"చోదయిత్రీ సూనృతానాం। చేతంతీ సుమతీనామ్। యజ్ఞం దధే సరస్వతీ॥" 4

"మాహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా। ధియో విశ్వా విరాజతి॥" 5

"చత్వారి వాక్పరిమితా పదాని। తాని విదుర్బ్రామ్మణా యే మనీషిణః ।
గుహా త్రీణి నిహితానీంగయంతి। తురీయం వాచో మనుష్యా వదంతి ॥" 6

"యద్వాగ్వదంత్యవిచేతనాని। రాష్ట్రీ దేవానాం నిషసాద మంద్రా,
చతస్ర ఊర్జం దురుహే పయాంసి। క్వస్విదస్యాః పరమం జగామ ॥" 7

"దేవీం వాచమజనయంత దేవాః। తాం విశ్వరూపాః పశవో వదంతి,
"సానో మంద్రేష మూర్జం దుహానా। ధేనుర్వాగస్మానుసుష్టుతైతు॥" 8

"ఉతత్వః పశ్యన్న దదర్శవాచమ్। ఉత త్వః శృణ్వన్ న శృణోత్యేనామ్,
ఉతోత్వ స్తస్మై తన్వం విసస్రే। జాయేవ పత్య ఉశతీ సువాసాః॥" 9

"అంబితమే నదీతమే। దేవి తమే సరస్వతి
అప్రశస్తా ఇవ స్మసి। ప్రశస్తిమంబ నస్కృధి॥" 10

# ఆశ్వలాయన దశశ్లోకీ

యా వేదాంతార్థా తత్త్వైకస్వరూపా పరమార్థతః,
నామరూపాత్మనా వ్యక్తా సా మాం పాతు సరస్వతీ. 1

యా సాంగోపాంగవేదేషు చతుర్ష్వేకైవ గీయతే,
అద్వైతా బ్రహ్మణశ్శక్తిః సా మాం పాతు సరస్వతీ 2

యా వర్ణపదవాక్యార్థా స్వరూపేణైవ వర్తతే,
అనాదినిధనానన్తా సా మాం పాతు సరస్వతీ. 3

ఆధ్యాత్మ మధిదైవం చ దేవానాం సమ్యగీశ్వరీ,
ప్రత్యగాస్తే వదన్తీ యా సా మాం పాతు సరస్వతీ. 4

అంతర్యామ్యాత్మనా విశ్వం త్రైలోక్యం యా నియచ్ఛతి,
రుద్రాదిత్యాదిరూపస్థా యస్యామావేశ్య తా పునః,
ధ్యాయన్తి సర్వరూపైకా సా మాం పాతు సరస్వతీ. 5

యా ప్రత్య గ్దృష్టిభిర్జీవై ర్వ్యజ్య మానానుజాయతే,
వ్యాపినీ జ్ఞప్తిరూపైకా సా మాం పాతు సరస్వతీ. 6

నామజాత్యాదిభిర్జీవై రష్టధా యా వికల్పితా,
నిర్వికల్పాత్మనా వ్యక్తా సా మాం పాతు సరస్వతీ. 7

వ్యక్తావ్యక్తగిర స్సర్వే వేదాద్యా వ్యాహరన్తి యామ్,
సర్వకామదుఘా ధేనుః సా మాం పాతు సరస్వతీ. 8

యం విజత్వాఖిలం బద్ధం నిర్మథ్యాఖిలవర్త్మనా,
యోగీ యాతి పరం స్థానం సా మాం పాతు సరస్వతీ. 9

నామరూపాత్మకం సర్వం యస్యామావేశ్య తాం పునః,
ధ్యాయన్తి సర్వరూపైకా సా మాం పాతు సరస్వతీ. 10

ఈ దశశ్లోకికి ముందు ప్రార్థనాశ్లోక మిది.

**"నీహారహారఘనసారసుధాకరాభాం**
**కల్యాణదాం కనకచంపకదామభూషామ్,**
**ఉత్తుఙ్గపీనకుచకుమ్భ మనోహరాంగీం**
**వాణీం నమామి మనసా వచసా విభూత్యై ॥**

ఈ దశశ్లోకికి చివర ప్రార్థనాశ్లోకములు.

చతుర్ముఖముఖాంభోజవనహంసవధూర్మమ,
మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ. 1

నమస్తే శారదే దేవి కాశ్మీరపురవాసిని,
త్వామహం ప్రార్థయే నిత్యం విద్యాదానం చ దేహి మే. 2

అక్షసూత్రాంకుశధరా పాశపుస్తకధారిణీ,
ముక్తాహారసమాయుక్తా వాచి తిష్ఠతు మే సదా. 3

కంబుకంఠీ సుతామ్రోష్ఠీ సర్వాభరణభూషితా,
మహాసరస్వతీ దేవీ జిహ్వాగ్రే సన్నివేశతామ్. 4

యా శ్రద్ధా ధారణా మేధా వాగ్దేవీ విధివల్ల భా,
భక్తజిహ్వాగ్రసదనా శమాదిగుణదాయినీ. 5

నమామి యామినీనాథలేఖాలంకృతకున్తలామ్,
భవానీం భవసన్తాపనిర్వాపణసుధానదీమ్ ॥ 6

కుమారసంభవంలో తారకాసురపీడితులైన దేవతలు బ్రహ్మకడకు వెళ్ళి ఆయనను స్తుతించారు. ఆ స్తుతి విని బ్రహ్మ

**"ఇతి తేభ్యః స్తుతిః శ్రుత్వా యథార్థా హృదయంగమాః,**
**ప్రసాదాభిముఖో వేధాః ప్రత్యువాచ దివౌకసః.**
**పురాణస్య కవేస్తస్య చతుర్ముఖసమీరితా,**
**ప్రవృత్తి రాసీచ్ఛందానాం చరితార్థా చతుష్టయీ."**

(కుమార సంభవము రెండవసర్గ-16,17) దానిని వ్యాఖ్యానిస్తూ మల్లినాథుడు- చతుష్టయీ చతుర్విధా శబ్దానాం ప్రవృత్తిః-వైఖరీ ప్రముఖా వాగ్వృత్తిః- ఉక్తఞ్చ-

వైఖరీ శబ్దనిష్పత్తిః మధ్యమా శ్రుతిగోచరా,
ద్యోతితార్థా చ పశ్యన్తీ సూక్ష్మా వాగనపాయినీ.

ఈ విషయంకూడా పై ఋక్కులలోని విషయాన్ని వివరించేదే. దీనినిబట్టే ఋగ్వేదంనాటికే వాక్తత్వాన్ని మన ఋషులు ఎంతగా వివేచించారో తెలుస్తుంది. పైన చూపిన దశశ్లోకిలోని శ్లోకాల అర్థాల్ని పరిశీలిస్తే వాగుపాసనావిధానం దానిలోని ఆంతర్యం అమూర్త పదార్థానికి మనవారు చేసిన మూర్తికల్పనా దాని ఉద్దేశ్యం స్పష్టమవుతుంది. ఈ విధంగా ప్రాణులమధ్యా పరస్పర భావప్రకటనానికి పనికివచ్చే వాక్కు మనుష్యులకు మాత్రమే ఉంది. తిర్యక్కులకు ఇట్టిది లేదు. అవి తమ మనస్సులలోని క్షుత్పిపాసాది సహజ చిత్తవృత్తులను(Instincts) ఏవో ధ్వనులద్వారా తెలుపుతాయి. మానవుడు వాటికి ఇదమిత్థమని అర్థనిర్ణయం చేయలేడు. ఆ ధ్వనుల్లో వైవిధ్యమూ స్పష్టతా లేదు. పైగా ఆ ధ్వనులు ఆయా ప్రాణులమధ్య పారస్పరిక భావప్రకటనకు పనికిరావు. అందుచేతనే అవి మానవునికంటె వెనుకబడి ఉన్నాయి. వాటిని అవ్యక్తవాచః అని, మానవులను వ్యక్తవాచః అని అన్నాడు పాణిని.

ఆర్ష సంప్రదాయాల్లో గాయత్ర్యుపాసనానికి విశిష్టస్థానం ఉంది. సంధ్యా వందనంలో ముఖ్యభాగం గాయత్రీమంత్రజపం. రెండవది సూర్యోపస్థానం. సంధ్యావందనం నిత్యమైన అనుష్ఠేయకర్మ. అంటే అది చేసినందువలన ఫలితం కలగడం ఎట్లా ఉన్నా చేయకపోతే ప్రత్యవాయం అనే దోషం ప్రాప్తిస్తుంది. అది తప్పక చేయవలసిన అనుష్ఠానం. గాయత్రి మంత్రార్థం విచారిస్తే సూర్యతేజస్సును మనలోనికి ఆవాహన చేసికొనడమే దాని ఆంతర్యం.

"యో దేవః సవితా ఽస్మాకం ధియోధర్మాది గోచరః,
ప్రేరయేత్తస్య యద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే."

సూర్యోపస్థానంకూడా అంతే. అఖిల జగత్తును భాసింపజేసే ఆదిత్యగతమైన తేజస్సు మన దేహమ్మీద ప్రసరిస్తే కలిగే ఫలితాలు ఛాందోగ్యోపనిషత్తులో (6–5) ఇలా చెప్పిఉంది. భుజింపబడిన తేజస్సు జీర్ణమై మూడు విధములగుచున్నది స్థూలాంశము ఎముక. మధ్యాంశము మజ్జ. సూక్ష్మాంశము వాక్కు అగుచున్నది కనుక వాక్సిద్ధికోసం గాయత్ర్యనుష్ఠానం, సూర్యోపాసనం చేయాలి సూర్యతేజస్సు నుంచి అస్థివృద్ధి జరుగుతుందనేది నేటి వైజ్ఞానికులు పరిశో[illegible] కను[illegible] విషయం. ఇది ఆర్యఋషులు ఆ నాడే మనకు తెలి[illegible]

ఈ దశశ్లోకికి ముందు ప్రార్థనాశ్లోక మిది.

"నీహారహారఘనసారసుధాకరాభాం
కల్యాణదాం కనకచంపకదామభూషామ్,
ఉత్తుఙ్గపీనకుచకుమ్భ మనోహరాంగీం
వాణీం నమామి మనసా వచసా విభూత్యై ॥

ఈ దశశ్లోకికి చివర ప్రార్థనాశ్లోకములు.

చతుర్ముఖముఖాంభోజవనహంసవధూర్మమ,
మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ. 1

నమస్తే శారదే దేవి కాశ్మీరపురవాసిని,
త్వామహం ప్రార్థయే నిత్యం విద్యాదానం చ దేహి మే. 2

అక్షసూత్రాంకుశధరా పాశపుస్తకధారిణీ,
ముక్తాహారసమాయుక్తా వాచి తిష్ఠతు మే సదా. 3

కంబుకంఠీ సుతామ్రోష్ఠీ సర్వాభరణభూషితా,
మహాసరస్వతీ దేవీ జిహ్వాగ్రే సన్నివేశతామ్. 4

యా శ్రద్ధా ధారణా మేధా వాగ్దేవీ విధివల్లభా,
భక్తజిహ్వాగ్రసదనా శమాదిగుణదాయినీ. 5

నమామి యామినీనాథలేఖాలంకృతకున్తలామ్,
భవానీం భవసన్తాపనిర్వాపణసుధానదీమ్ ॥ 6

కుమారసంభవంలో తారకాసురపీడితులైన దేవతలు బ్రహ్మకడకు వెళ్ళి ఆయనను స్తుతించారు. ఆ స్తుతి విని బ్రహ్మ

"ఇతి తేభ్యః స్తుతీః శ్రుత్వా యథార్థా హృదయంగమాః,
ప్రసాదాభిముఖో వేధాః ప్రత్యువాచ దివౌకసః.
పురాణస్య కవేస్తస్య చతుర్ముఖసమీరితా,
ప్రవృత్తి రాసీచ్ఛందానాం చరితార్థా చతుష్టయీ."

(కుమార సంభవము రెండవసర్గ-16,17) దానిని వ్యాఖ్యానిస్తూ మల్లినాథుడు- చతుష్టయీ చతుర్విధా శబ్దానాం ప్రవృత్తిః-వైఖరీ ప్రముఖా వాగ్వృత్తిః- ఉక్తఞ్చ-

**వైఖరీ శబ్దనిష్పత్తిః మధ్యమా శ్రుతిగోచరా,**
**ద్యోతితార్థా చ పశ్యన్తీ సూక్ష్మా వాగనపాయినీ.**

ఈ విషయంకూడా పై ఋక్కులలోని విషయాన్ని వివరించేదే. దీనినిబట్టే ఋగ్వేదంనాటికే వాక్తత్వాన్ని మన ఋషులు ఎంతగా వివేచించారో తెలుస్తుంది. పైన చూపిన దశశ్లోకిలోని శ్లోకాల అర్థాల్ని పరిశీలిస్తే వాగుపాసనావిధానం దానిలోని ఆంతర్యం అమూర్త పదార్థానికి మనవారు చేసిన మూర్తికల్పనా దాని ఉద్దేశ్యం స్పష్టమవుతుంది. ఈ విధంగా ప్రాణులమధ్యా పరస్పర భావప్రకటనానికి పనికివచ్చే వాక్కు మనుష్యులకు మాత్రమే ఉంది. తిర్యక్కులకు ఇట్టిది లేదు. అవి తమ మనస్సులలోని క్షుత్పిపాసాది సహజ చిత్తవృత్తులను(Instincts) ఏవో ధ్వనులద్వారా తెలుపుతాయి. మానవుడు వాటికి ఇదమిత్థమని అర్థనిర్ణయం చేయలేడు. ఆ ధ్వనుల్లో వైవిధ్యమూ స్పష్టతా లేదు. పైగా ఆ ధ్వనులు ఆయా ప్రాణులమధ్య పారస్పరిక భావప్రకటనకు పనికిరావు. అందుచేతనే అవి మానవునికంటె వెనుకబడి ఉన్నాయి. వాటిని అవ్యక్తవాచః అని, మానవులను వ్యక్తవాచః అని అన్నాడు పాణిని.

ఆర్ష సంప్రదాయాల్లో గాయత్ర్యుపాసనానికి విశిష్టస్థానం ఉంది. సంధ్యా వందనంలో ముఖ్యభాగం గాయత్రీమంత్రజపం. రెండవది సూర్యోపస్థానం. సంధ్యావందనం నిత్యమైన అనుష్ఠేయకర్మ. అంటే అది చేసినందువలన ఫలితం కలగడం ఎట్లా ఉన్నా చేయకపోతే ప్రత్యవాయం అనే దోషం ప్రాప్తిస్తుంది. అది తప్పక చేయవలసిన అనుష్ఠానం. గాయత్రి మంత్రార్థం విచారిస్తే సూర్యతేజస్సును మనలోనికి అవాహన చేసికొనడమే దాని ఆంతర్యం.

**"యో దేవః సవితా ఽస్మాకం ధియోధర్మాది గోచరః,**
**ప్రేరయేత్తస్య యద్భర్గ స్తద్వరేణ్య ముపాస్మహే."**

సూర్యోపస్థానంకూడా అంతే. అఖిల జగత్తును భాసింపజేసే ఆదిత్యగతమైన తేజస్సు మన దేహమ్మీద ప్రసరిస్తే కలిగే ఫలితాలు ఛాందోగ్యోపనిషత్తులో (6-5) ఇలా చెప్పిఉంది. భుజింపబడిన తేజస్సు జీర్ణమై మూడు విధములగుచున్నది స్థూలాంశము ఎముక. మధ్యాంశము మజ్జ. సూక్ష్మాంశము వాక్కు అగుచున్నది కనుక వాక్శుద్ధికోసం గాయత్ర్యనుష్ఠానం, సూర్యోపాసనం చేయాలి సూర్యతేజస్సు నుంచి అస్థివృద్ధి జరుగుతుందనేది నేటి వైజ్ఞానికులు పరిశో[illegible] కను[illegible] విషయం. ఇది ఆర్యఋషులు ఆ నాడే మనకు తెలి[illegible]

సంబంధించిన మరొక విషయంకూడా మనకు అందించారు. ఈ వాక్కుయొక్క విరాడ్రూపనే సమస్త వైదిక లౌకిక వాఙ్మయమున్నూ;వాక్కే గాయత్రి; "వాగ్వైగాయత్రీ" అను శ్రుతి.

**"అనఘ! సావిత్రి యనఁగ గాయత్రి యనఁగ**
**విశ్వజనయిత్రి యనఁ జతుర్వేదమాత,**
**యనఁబరాపర బ్రహ్మ ద్వయం బనంగ**
**న మ్మహాదేవికి సమాహ్వయాంతరములు."**

(కాశీఖండము. 3-193) సవితా అంటే సూర్యుడు, సవితకు సంబంధించినది. సావిత్రి. ఈ విధంగా ఆమె "కడుపుచల్లంగ వేదాళిఁగన్న తల్లి" (కాశీ. 3-185) "గాయత్రీ ఛందసాం మాతా" ఉపోద్ఘాతం, "అర్కబింబాభివ్యక్తా ఆదిత్య శబ్దవాచ్యా పరబ్రహ్మరూపా చిచ్ఛక్తిరేవ సంధ్యాదేవతా" "ఆదిత్య రూపా చిచ్ఛక్తిరేవ గాయత్ర్యాభా భవతి." సవితకు సంబంధించింది కనుక ఆమెయే సావిత్రి. "వాగ్వైగాయత్రీ" అనే శ్రుతినిబట్టి వాక్కూ గాయత్రీ-అభిన్నాలు. వాగధిష్ఠాత్రి దేవత సరస్వతి . ఈ విధంగా గాయత్రీ-సావిత్రీ- సరస్వతీ-ఈ ముగ్గురికీ అభేదం సిద్ధిస్తున్నది. వీరిని ఉపాసించే మార్గాలు మాత్రం అధికార భేదాన్నిబట్టి వేరు వేరుగా ఉన్నై.

సరస్వతీ పర్యాయపదాలకు లోకవ్యవహారంలో విశేషమైన స్థానం ఉంది. ఎంతమందో స్త్రీలకు వాణీ, భారతీ, సరస్వతీ, శారద అనే పేర్లు వింటూ ఉన్నాము. శ్రీ శంకరభగవత్పాదులతో వాదించి పరాజితుడై సన్యాసాశ్రమము స్వీకరించి సురేశ్వరాచార్యుడైన మండనమిశ్ర పండితుని పత్ని పేరు ఉభయభారతి. తన భర్తకూ భగవత్పాదులకూ జరిగిన వాదంలో మధ్యవర్తిని కావడం ఆమె పాండితీ విశేషానికి చిహ్నం. కవిరాజూ, రాజకవీ ఐన భోజుడు రచించిన అలంకారశాస్త్రం పేరు సరస్వతీకంఠాభరణం. తంజాపురనాయకరాజుల కొలువుకూటం. గ్రంథాలయం పేరు సరస్వతీమహల్. శారదాతనయు డొక సుప్రసిద్ధాలంకారికుడు. సుబ్రహ్మణ్యభారతి అనే పేరు, "సరస్వతీపుత్ర" అనే బిరుదు మనకు తెలిసినవే.

సంస్కృత వాఙ్మయంలో ఈ సరస్వతిప్రార్థనకు ప్రచురమైన స్థానమున్నది. "సహ నావవతు" ఇత్యాది శాన్తిపాఠమూ, ఋగ్వేదంలోని ఋక్కులూ ఈ విషయంలోని ముఖ్యమైన దృష్టాంతాలు, గాయత్ర్యుపాసన సంధ్యావందనంలో ముఖ్యభాగంగా ఉండడం, దానిలోని సూర్యోపస్థానాదికం మన ఆర్యఋషులు

మన కందించిన అమూల్యమైన సంప్రదాయ ధనం. ఇక ఆదికవి వాల్మీకి. మహాతపస్వి ఐన అతని దగ్గరకు బ్రహ్మదేవుడే స్వయంగా సరస్వతిని పంపాడు.

**"శ్లోక ఏవ త్వయా బద్ధో నాత్ర కార్యా విచారణా,**
**మచ్ఛన్దా దేవ తే బ్రహ్మన్ప్రవృత్తేయం సరస్వతీ"**

అని బ్రహ్మవచనం. కాళిదాసు శాకున్తల విక్రమోర్వశీయాల భరతవాక్యాల్లో సరస్వతీ స్మరణ చేశాడు. ఆచార్య దండి తన కావ్యాదర్శారంభంలో సరస్వతీ ప్రార్థన చేశాడు. "చతుర్ముఖ ముఖాంభోజ..." ఇత్యాది శ్లోకం అదే. మమ్మటాచార్యులు కావ్య ప్రకాశంలో

**"నియతి కృత నియమరహితాం హ్లాదైకమయీ మనన్య పరతన్త్రామ్,**
**నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతి"**

త్రివిక్రమభట్టు నలచంపువులో

**"జయతి గిరిసుతాయాః కామసన్తాపవాహి**
**న్యురసి రసనిషేకశ్ఛాందస శ్చంద్రమౌళిః**
**తదను చ విజయన్తే కీర్తిభాజాం కవీనాం**
**అసకృ దమృతబిన్దుస్యన్ది నో వాగ్విలాసాః."**

విద్యానాథుడు ప్రతాపరుద్రీయారంభంలో

**"విద్యాకైరవకౌముదీం శ్రుతిశిరస్సీమన్త ముక్తామణిం**
**దారాన్ పద్మభువః త్రిలోకజననీం వన్దే గిరాం దేవతామ్,**
**యత్పాదాబ్జ నమస్క్రియా స్సుకృతినాం సారస్వత ప్రక్రియా**
**బీజన్యాసభువో భవన్తి కవితానాట్యైక జీవాతవః."**

శ్రీమల్లినాథుడు

**"శరదిన్దువికాసమన్దహాసాం స్ఫురదిన్దీవరలోచనాభిరామామ్,**
**అరవిన్దసమాన సున్దరాస్యాం అరవిన్దాసనసున్దరీముపాసే.**
**తద్దివ్యమవ్యయం ధామ సారస్వత ముపాస్మహే,**
**యత్ప్రకాశాత్ప్రలీయన్తే మోహాన్ధతమసశ్ఛటాః."**

తులసీదాసు

**"వర్ణానా మర్థసంఘానాం రసానాం ఛన్దసామపి,**
**మంగళానాం చ కర్తారౌ వన్దే వాణీవినాయకౌ."**

సరస్వతికి ఇంత గొప్పతనం ఉన్నది. కాని సరస్వతి ఎవరిని విశేషంగా అనుగ్రహిస్తుందో వారిని లక్ష్మి దూరంనుంచి కూడా చూడదు అని ప్రవాదం. లక్ష్మి విష్ణుపత్ని. బ్రహ్మ విష్ణు తనయుడు. సరస్వతి లక్ష్మికి కోడలు. అత్తా కోడండ్ర పోరు లోకంలో సహజమే అని చమత్కారం. మొత్తంమీద మతిమంతులు దరిద్రులు కావడం లోకంలో చాలావరకు కనబడుతుంది. ఈ దోషంవలన క్లేశం కాళిదాసుకూడా అనుభవించాడో ఏమో తెలియదు. అతని విక్రమోర్వశీయంలో భరతవాక్య మిలా ఉన్నది.

**"పరస్పరవిరోధిన్యో రేకసంశ్రయదుర్లభమ్,**
**సంగతం శ్రీ సరస్వత్యోః భూతయేఽ స్తు సదా సతామ్."**

భర్తృహరి చెప్పిన ఈ శ్లోకాలున్నూ అదే అభిప్రాయాన్ని బలపరుస్తున్నవి.

**"గజభుజంగవిహంగమ బన్ధనం శశిదివాకరయోర్గ్రహపీడనమ్,**
**మతిమతాఞ్చ విలోక్య దరిద్రతాం విధి రహో బలవానితి మే మతిః."**

అయినా ఏ ధనమూ విద్యకు సాటికాదు.

**"స్వగృహే పూజ్యతే మూర్ఖః స్వగ్రామే పూజ్యతే ప్రభుః,**
**స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే."**

ఈ విషయమే శ్రీనాథుడు

**"ఏ భయంబును నెచ్చోట నెనయలేదు**
**నరున కెప్పాట విద్యాధనంబ ధనము**
**చోరబాధాదికము చేతఁ జూఱవోవు**
**ధనము ధనమౌనె ఎన్నిచందములఁ దలఁప"**

అన్నాడు. విద్యావంతులతోనూ సత్కవులతోనూ సాటి ఎవ్వరూ రారు. ఓ రాజులారా! వారితో పోటీ పెట్టుకొనవద్దు. వారిని అనాదరం చేయవద్దు. వారి ధనం ముందు మీ ధనం ఎంత? అని మందలించాడు భర్తృహరి.

**"శాస్త్రోపస్కృత శబ్దసున్దరగిరః శిష్యప్రదేయాగమాః**
**విఖ్యాతాః కవయో వసన్తి విషయే యస్య ప్రభోర్నిర్ధనాః,**
**తజ్జాడ్యం వసుధాధిపస్య; సుధియస్త్వర్థం వినాపీశ్వరాః**
**కుత్స్యాః స్యుః కుపరీక్షకై ర్న మణయో ర్యైరర్ఘతః పాతితాః"**

**"అధిగత పరమార్థా న్పండితాన్ మాఽవమంస్థాః**
**తృణమివ లఘులక్ష్మీర్నైవ తాన్సంవృణద్ధి.**
**అభినవ మదలేఖాశ్యామగండస్థలానాం**
**న భవతి బిసతన్తుర్వారణం వారణానామ్."**
**జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,**
నాస్తి తేషాం యశఃకాయే జరామరణం భయమ్".

ఇటువంటి విద్యాధనం లభించటానికి సరస్వతీ కటాక్షవీక్షణ ప్రసారం ఆవశ్యకం. అది లేనిదే ఎవ్వరైనా సరే నోరు మెదల్పలేక మూధులూ మూకులూ ఐపోవలసిందే. తదనుగ్రహ సంపాదనార్థం నిరంతరమూ అనుష్ఠానం చేయాలి. తత్త్వజ్ఞానంతో చేసే అనుష్ఠానం ఉత్తమఫలప్రదం. ఋషులు ఇలాంటివారు. వారు వాణీతత్త్వం ఎఱిగినవారు, వారు ఆమెను స్తుతించడం, పూజించడం, మంత్రం జపించడం ఆవశ్యకం కాదు. వారిపై సరస్వతీ మధు మధురదృష్టి ప్రసరించింది. వారు మన్త్రద్రష్టలైనారు. ఉపనిషదుపదేష్టలైనారు. ఆదికవి వాల్మీకి అట్టివాడే. వేద ప్రతిపాద్య విషయ ప్రతిపాదకమైన రామాయణం రచించి లౌకిక సారస్వతంలో తానే ఆదికవి ఐనాడు. తత్త్వజ్ఞానం లేని సాధారణులు మన్త్రానుష్ఠానాదికం, పూజాపురస్కారాలూ, స్తోత్రపాఠాదికం ద్వారా దేవతానుగ్రహసిద్ధి పొందాలి. కవులు తమ కావ్యారంభంలో సరస్వతీస్తుతి చేయడం ఇటువంటిదే.

తెలుగు కవులలో మనకు తెలిసినంతవఱకు నన్నయ మొదటివాడు. అతడుగానీ తిక్కన, భాస్కరుడూ, నాచనసోమనాదులు కొందరు తమ కావ్యాల ఆరంభంలో సరస్వతీ ప్రార్థన చేయలేదు. మిగిలివారు చాలవరకు తమ కావ్యాల ఆరంభంలో సరస్వతీ ప్రార్థన సంప్రదాయంగా పాటిస్తూ వచ్చారు. వాటిలో ఒక్కొక్క విశేషం గోచరిస్తూ ఉన్నది. వీటిలో చాలా పద్యాల్లో ఆ కావ్యంలోని కథావస్తువు ధ్వనించటం కనబడుతుంది.

**"లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే**
**ఋషీణాం పునరా ద్యానాం వాచమర్థో ఽ నుధావతి"**

అని భవభూతి. కవులు ఋష్యంశ కలవారు "నానృషిఃకురుతేకావ్యమ్." ఐనా వారు సాక్షాత్తు ఋషులు కారు. వీరు అన్నదల్లా జరగడం సాధ్యం కాకపోవచ్చు. కాని కొందరివాక్కుకు అటువంటి శక్తికూడా ఉన్నదని వారినిగూర్చి జనపరంపరలో ఉన్న కథలు తెలుపుతూ ఉన్నై. అంతకాకపోయినా కవులు పై శ్లోకంలో చెప్పిన లౌకిక సాధువులు మాత్రం ఔతారు. కనుక అప్రయత్నంగానైనా వారివాక్కు తమ కావ్యంలో ముందు రాబోయే కథావస్తువును సూచించడం సంభవమే. మరికొన్నిటిలో ఆయా కవులు తమ కవితాలక్షణాన్ని స్ఫురింపజేయడం కనబడుతుంది. సాహిత్య చారిత్రక అంశాలు కొన్నిటిలో స్ఫురిస్తు న్నై.

రచయిత

# భారతీ వైభవం

## 1

**తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్ నీవు నా**
**యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో**
**భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ,**
**పుల్లాబ్జాక్షి, సరస్వతీ, భగవతీ, పూర్ణేందుబింబాననా.**

సమస్త విద్యలకు తల్లి సరస్వతీ, నేను నిన్ను స్మరిస్తూ పాఠానికై పుస్తకం చేత పట్టాను. నీవు ఎల్లప్పుడూ నా ఉల్లంలో నిల్చి ఉండి నన్ను అను గ్రహించు. నా మనస్సు సర్వదా నీ మీదనే – అంటే విద్యమీదనే. శ్రద్ధతో ఉండేటట్లు దయచూడు. ప్రతిభాస్వరూపవైన నీవు నా ఉల్లంలో నెలకొని ఉండాలి. నేను ప్రతిభాసంపన్నుణ్ణి కావాలి. ఉచ్చారణదోషం, పద అసాధుత్వదోషం మొదలైన లోపాలు లేని సుశబ్దాలూ విద్యలూ నాకు ప్రసాదించు. నీవు జగన్మోహినివి. అన్ని జగత్తులవారినీ ముగ్ధులను చేయగలవు. మంచి వాక్కు యొక్క ప్రభావం అటువంటిది. అది నీ దయతో నాకు లభించాలి.

కావ్యరచనారంభంలో కవి చేసే ప్రార్థనగా దీన్ని సమన్వయించవచ్చు; నేను నిన్ను స్మరిస్తూ కావ్యరచనకు పూనుకొన్నాను. నీవు నా ఉల్లంలో నిల్చి ఉండు. నా చిత్తం ప్రతిభా భాసమానం చేయి–సుశబ్దంతో కలిసి శోభిల్లే ఉక్తులు అంటే–సూక్తులు నా వాక్కునుండి విజృంభించేటట్లు అనుగ్రహించు. అవి సుశబ్దాలు కావాలి–సౌశబ్ద్యం కలిగి వ్యాకరణ దోషాలు కావ్యదోషాదికం లేనివై ఔచిత్య శోభితంగా ఉండాలి. నీవు జగన్మోహినివి; కావ్యం మాధుర్య సంపన్నం చేసి జనులను ముగ్ధులనుగా చేయగలవు.

## 2

**క్షోణీతలంబున(నె)న్నుదురు సోఁకగ మ్రొక్కి నుతింతు సైకత**
**శ్రోణికిఁ జంచరీకచయ సుందరవేణికి రక్షితామర**
**శ్రేణికిఁ దోయజాత భవచిత్త వశీకరణైకవాణికిన్**
**వాణికి నక్ష దాను శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్.**

## 3

**శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా**
**హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుందమం**
**దార సుధాపయోధి సితతామరసామరవాహినీ శుభా**
**కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నడు గల్గు భారతీ.**

## 4

**అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ, శారదచంద్ర చంద్రికా**
**డంబరచారుమూర్తి ప్రకటస్ఫుట భూషణ రత్నదీపికా**
**చుంబిత దిగ్విభాగ, శ్రుతిసూక్తి వివిక్త నిజప్రభావ భా**
**వాంబరవీధి విశ్రుత విహారిణి, నన్ గృపఁజూడు భారతీ.**

శ్రీ బమ్మెరపోతనామాత్యుని శ్రీమదాంధ్ర మహాభాగవతంలోనివి ఈ సరస్వతీ స్తుతి పద్యాలు. క్షోణితలంబు;- ఈ పద్యంలో కనబడే విశిష్టతలలో చూడగానే అతి స్పష్టంగా కానవచ్చేది సహజపాండిత్యుని సహజలక్షణం ఐన అంత్యానుప్రాసం. ఇది ఆయన కవిత్వంలో దాదాపు చాలావరకు సార్వత్రికమే. పద్యంలో ఆపాతతః కనబడే భావమూ సరస్వతీ రూపవర్ణనా సరళంగానూ సాధారణంగానూ ఉన్నట్లుంది. కాని దీంట్లో ఏ తత్త్వావ్యగత వస్తువు కొంత ధ్వనిత మౌతున్నది. సైకతశ్రోణిపదంచేత కృష్ణైకగత జీవితలైన గోపసైకత శ్రోణుల మధురభక్తిని, చంచరీక పదంచేత భ్రమరగీతలకు గల ప్రాముఖ్యం ద్యోతకమౌతున్నది. ఈ కావ్యంలో ఆదినుండి అంతంవరకూ సార్వత్రికంగా ఉన్న విషయం రక్షితామరశ్రేణి ఐన అమరసమూహాన్ని రక్షించిన వాసుదేవుని అవతార వర్ణనమే. వాణియొక్క-వాణి-వాక్కు తోయజాత భవుని-బ్రహ్మయొక్క చిత్తాన్ని వశీకరించుకొనగలది. బ్రహ్మ సర్వవేదాలకు ప్రతీకం. అతని చిత్తాన్ని-అంటే వేదాల పరమ తాత్పర్యాన్ని వశీకరించుకొనే ఉత్తమవాక్కులు ఉపనిషత్తులు. సర్వ వేదాంతసార ప్రతిపాదకమే ఈ భాగవతం. అక్షములు, ఇంద్రియాలు-అనే పశువులకు దామ-పశువులను కట్టివేసే త్రాడువంటి వాడయిన మనస్సుతోసహా ఇంద్రియములను నిగ్రహించినవాడైన శుకుడు అనే-వా-వికల్పములకు అరి-శత్రువు-యోగి అతడు. అన్ని ద్వంద్వాలకూ బ్రహ్మ యొక్క జగత్తుయొక్క సత్యత్వా నిత్యత్వాల విషయంలో ఏ సంశయాలకూ తావులేని

నిశ్చితాత్ముడు. ఆతనినుండి-జ-పుట్టిన, పుస్తకం ఏతద్భాగవతమే. దానితో రమ్యమైన పాణిగలది వాణి. ఈ భాగవతం వాణీ కరకమాలానికి అలంకారభూతమని భావం.

**"నిగమకల్పతరోర్గళితం ఫలం శుకముఖా దమృతద్రవసంయుతమ్,**
**పిబత భాగవతం రసమాలయం ముహురహో రసికా భువి భావుకాః."**

నేను రచించబోయే మహాగ్రంథం ఇంత ఉత్కృష్టమైనది కనుక ఇది తెలుగువారికి ఇహపర సాధనం. అవశ్య పఠనీయం అని పోతనామాత్యుడు తన కావ్య విశిష్టతను తెలుపుచున్నాడు. తద్వారా పఠితలను స్వకావ్యపఠనోన్ముఖుల్ని చేస్తున్నాడు.

శారద నీరదేందు:- భారతీదేహ వర్ణానికి తుల్యసామగ్రిగా శారదనీరదం మొదలైనవి చెప్పడం సహజం. ఇటువంటి వాగ్దేవి తన హృదయంలో సాక్షాత్కరించాలనే ఔత్సుక్యం కవి ఈ పద్యంలో వ్యక్తం చేశాడు.

భారతియొక్క వ్యక్తమయిన రూపం కావ్యం. దీనికి ప్రధానమైనసాధన సామగ్రి ప్రతిభా ప్రభావితమైన వాక్కులు. అవి తన మదికి భాసించాలనేదికూడా కవి అనుభూతి పొందే ఔత్సుక్యంలో విషయమే. ఆ వాక్కులో నిర్మలమయి శారదనీరదంవలె ఉండాలి. వాటికి కాంతీ ఆర్ద్రతా గురుత్వమూ లేవు. గాలికి చెదరిపోతవి. ఇంద్రుడు వృద్ధిక్షయాలకు పాత్రమైనవాడు. కళంకి; ఘనసారం గాలిలో కలిసిపోతుంది. మరాళం సంవత్సరంలో కొన్ని మాసాలే కనబడి మళ్లీ మానససరస్సుకు చేరుకొంటుంది. మల్లికాహారం శీఘ్రంగా మ్లానమౌతుంది. తుషారానికి ధైర్యం, స్థైర్యం లేవు. ఫేనం శుష్కమూ కాదు, రసార్ద్రమూ కాదు రజతాచలం. అందరికీ అందరానిది, కాశ సుమాలు నిర్గంధాలు. శరత్తులోనే వాటి వికాసం. ఫణీశుడు ఎంత మంచివాడైనా ఫణి కనుక అతనిపేరు చెప్పితే భయమే. కుందాలు మందారాలూ మల్లికలతోపాటే. సుధాపయోధి మథనానికి లోనయింది. సితతామరసశోభ సూర్యు డున్నంత సేపే. అమరవాహిని విష్ణుపాదోద్భవ; త్రిలోకపావని. సర్వకాలీన; రసార్ద్రహృదయ; మహాదేవ శిరోధార్య; అయువంటి శుభాకారం కల వాక్కులే తాను రచించబోయే అమరవాహినీ జనకుని గుణాను వర్ణనపరమైన కావ్యరచనకు అనుకూలం అనేది కవియొక్క భావన ఐనట్లు ఊహించవచ్చు.

అంబ నవాంబుజోజ్జ్వల:- శారదా రూపవర్ణనంతోనూ ఆమె మహిమాను వర్ణనంతోనూ భారతిని కవి ప్రార్థించడం ఈ పద్యంలో అప్రయత్నంగా కనబడే విషయం.

కవి తాను వ్రాయబోయే శ్రీమద్భాగవతంలోని శైలి నవాంబుజాల వలె ఉజ్జ్వలంగా వెలుగొందాలి. ఆ కావ్యం శరత్కాలీనచంద్రుని చంద్రికవలె చారుమూర్తి కావాలి. కళంకం చంద్రునికి ఉన్నది. కాని అతని చంద్రిక నిర్మలమూ ఆహ్లాదజనకమూ. ప్రకటమై స్ఫుటంగా కనబడే కావ్యశోభాధాయక ధర్మాలైన ఓజః ప్రసాద మాధుర్యాలూ శబ్దార్థాలంకారాలూ అనే రత్నదీపికలు కావ్య ప్రకీర్తిని దిగ్విభాగాలను చుంబించేటట్టు చేయాలి. కావ్యముయొక్క ప్రభావాన్ని దానిలో ప్రతిపాద్యమైన భగవత్ప్రభావ వర్ణననూ వివేచించడానికి సమర్థమై శ్రుతివలె పవిత్రమయి సౌష్ఠవంతోనూ నుడికారంతోనూ ఒప్పే తిన్నని పలుకులతో తనకావ్యం నిండారి వుండాలి. ఆ రచన పారమార్థిక విషయమాత్ర ప్రతిపాదకమై కేవలం పురాణరచనగా కాక భావనలు అనే అంబర వీథిలో విశ్రుత వహారం చేస్తూ ఉత్తమ మధురాకల్ప కల్పనలకు నిలయమై కవి ప్రతిభను వ్యక్తంచేస్తూ భావుకులయిన రసికులకు ముహుర్ముహుః పఠనాసక్తిని రేకెత్తించేది కావాలి. ఈ విధంగా భారతి తన్ను కృపతో చూడాలి అని కవిప్రార్థన.

ఈ పద్యం-ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాసిన ఆంధ్రమహాభారతం లోనిది. పోతనగారు ఈ పద్యముపైగల మక్కువచొప్పున తన భాగవతములో చేర్చుకున్నాడు.

5

**సింహాసనము చారుసిత పుండరీకంబు**
**చెలికత్తె చిలువారు పలుకుఁజిలుక**
**శృంగారకుసుమంబు చిన్ని చుక్కలరాజు**
**పసిఁడి కిన్నెరవీణె పలుకుఁదోడు**
**నలువనెమ్మోముఁదమ్ములు కేళిగృహములు**
**తళుకుటద్దంబు సత్కవుల మనసు**
**వేదాది విద్యలు విహారణస్థలములు**
**చక్కని రాయంచ యెక్కిరింత**

**యెపుడు నేదేవి కాదేవి యిందు కుంద**
**చంద్ర చందన మందార సారవర్ణ**
**శారదాదేవి మామకస్వాంతవీథి**
**నిండు వేడుక విహరించు చుండుఁగాత.**

కవిసార్వభౌముడు శ్రీనాథమహాకవి రచించిన శృంగార నైషధములోని సరస్వతీ ప్రార్థన మిది.

శారదాదేవియొక్క వాగ్దేవతాత్మక స్వరూపం ఈ పద్యంలో విస్పష్టంగా వర్ణించబడింది. కవి ఎత్తుగీతిలో శారదా వర్ణనాపరమయిన విశేషణాలు ఉపయోగించి తన సాహిత్యం అంతగా శుభ్రవర్ణపరిభాసితమని సూచిస్తున్నాడు. విద్వదౌషధమని పేరుగాంచినది శ్రీహర్షుని నైషధీయ చరితం. దానికికూడా మెఱుగులు దిద్దుతూ అనువాదం సాగించానని సాభిమానంగా చెప్పుకొన్నాడు శ్రీనాథుడు. అటువంటివాని సాహిత్యం గరిమ శారదాదేవివలెనే ఇందు కుంద చంద్రచందన మందార సవర్ణం అనడంలో అతిశయోక్తి ఏమీ ఉండదు.

తన పలుకులు శారదా కరకలిత రాజకీరపు పలుకులవలెనే మధురములు. తన కావ్యగానం పలుకులవెలది కేలుదమ్ములలో ఆమెకు పలుకుదోడుగా ఉన్న పసిడి కిన్నెరవీణె నాదంవలె శ్రోతృమనోమోహనం. తన ముఖం నలువ నెమ్మోముదమ్ములవలెనె వేదాలకు నిలయం. వాణి చేతి తళుకుటద్దమే తన మనస్సు. భారతికి వలెనే తనకుకూడా వేదాదివిద్యలు విహరణస్థలములు. కనుక వాణి తన స్వాంతవీథిలో నిండు వేడుకతో విహరించడానికి ఏమీ సంకోచించనక్కరలేదు అని కవి భావం ఐనట్లు ఊహించవచ్చు.

## 6

**కంఠపీఠిక నోంకార ఘంట మొరయఁ**
**జెలఁగుఁగావుత మన్మనః క్షేత్రసీమఁ**
**గవికుటుంబంబు పాలిటి దివిజసురభి**
**జలజసంభవుబోటి భాషావధూటి.**

శ్రీనాథుని కాశీఖండంలోని సరస్వతీస్తవం ఈ పద్యం. కవి **కుటుంబంబుపాలిటి దివిజసురభి జలజసంభవుబోటి** ఐన **భాషావధూటి** తన **కంఠపీఠికయందు ఓంకారఘంట మొరయుచుండ మన్మనఃక్షేత్ర సీమయందుఁ**

జెలఁగుఁగావుత మని కవిసార్వభౌముని వేడికోలు. శారద కవికుటుంబంబు పాలిటి కామధేనువు. వారి కావ్యాలలో వారు కోరినవిధంగా రససిద్ధి కలిగించడంలో ఆమెది పెట్టిందిపేరు. ఇది అమెవల్ల కవి లోకానికీకూడా కలిగే లౌకిక ప్రయోజనం. కావ్యరసా స్వాదనం ద్వారా అనిర్వచనీయానందాను భూతి. దానితోపాటు సదుపదేశమూ అందువల్ల లభించేవరకు ప్రయోజనం. అటువంటి కామగవి తనమనస్సనే క్షేత్ర సీమ చెలగవలెనని కవిసార్వభౌముని అభిలాష. అమె తన మనః క్షేత్రములో సంచరించే సమయంలో ఆమె కంఠపీఠికయందలి ప్రణవఘంట మ్రోగుతూ ఉంటుంది. ఘంటానాదం రాక్షస నిర్గమనానికీ దేవతాగమనానికి హేతువు. "ఆగమార్థం తు దేవానాం గమనార్థం తు రక్షసామ్, కురు ఘంటారవమ్" వాగ్దేవీ ప్రసాదముచే తనమనస్సులోని అరిషట్కం అనే రాక్షసులు నిర్గమించాలనీ శమగమాదులనే దేవతలు అచటికివచ్చి నెలకొనాలని భావం.

ప్రణవం పరమేశ్వరుని ప్రతీక.

**"యో వేదాదౌ స్వరః ప్రోక్తోవేదాన్తే చ ప్రతిష్ఠితః,**
**తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః."**

ప్రణవోపాసన పరమార్థ సాధనం. తాను వ్రాయబోయేది కాశీ క్షేత్రమహిమను తెలిపే కాశీఖండకావ్యం. అది భోగమోక్షప్రదం. ఆనందకాననం అని ప్రసిద్ధిపొందినది. ఐహలౌకిక పారలౌకిక ఆనందాలను రెంటినీ ప్రసాదించగలది. అటువంటి కావ్యం ఆరంభంలో లౌకిక అలౌకిక ప్రయోజనాలకు రెంటినీ ఆశించి శారదను కవి నుతించడం సమంజసమే.

## 7

**వాణికిఁ, జరణానతగీ**
**ర్వాణికి, నేణాంక శకల రత్న శలాకా**
**వేణికిఁ, బుస్తక వీణా**
**పాణికి, సద్భక్తితో నుపాస్తి యొనర్తున్.** 1-4.

శ్రీనాథుని హరవాలాసములోని దీ వాణీస్తుతి.

హరవిలాసంలో ఆ పేరుకు తగినట్లు నిఖిలలోకక్షేమ సంధాయకాలైన హరుని లీలావిలాసాలు వర్ణ్యాంశాలు. పరమేశ్వరుడు చరణానత గీర్వాణుడు.

ఏణాంకశకల రత్నశలాకాలంకృత జటాజూటుడు. ఈ హరవిలాస కావ్యంలోని కథలలోకెల్ల పార్వతీకల్యాణం మకుటాయమానం. పార్వతికూడా చరణానత గీర్వాణ. ఏణాంకశకల రత్నశలాకాలంకృతవేణి. శక్తి శివులు అభిన్నులు కదా.

**"ప్రణమ్య శితికంఠాయ విబుధాస్తదనంతరమ్,**
**చరణౌ రంజయం త్వస్యా శ్చూడామణి మరీచిభిః." (కుమా.6-81)**

అని కాళిదాసు, త్రైలోక్యమునకు జంద్రకళాధరుడు తండ్రి, తల్లి యౌఁగాక యీ తలిరుబోఁడి; హరునకు మ్రొక్కి యనంతరం అమరులీ కుటిలకుంతలకు మ్రొక్కుదురుగాక (హరివిలా.4-65).

## 8

**రాజీవభవుని గారాబుఁబట్టపుదేవి**
**యంచబాబా నెక్కు నలరుఁబోణి**
**పసిడి కిన్నెర వీణెఁబలికించు నెలనాఁగ**
**పదునాల్గువిద్యల పట్టుఁగొమ్మ**
**యీరేడు భువనంబు లేలు సంపదచేడె**
**మొలక చందురుఁ దాల్చు ముద్దరాలు**
**వెలిచాయ కొదమ రాచిలుక నెచ్చెలికత్తె**
**ప్రణవపీఠికనుండు పద్మగంధి**

**మందరాచల కందర మథ్యమాన**
**దుగ్ధ పాథోధిలహరికోద్భూతమైన**
**లలిత సాహిత్య సౌహిత్య లక్ష్మి నొసఁగి**
**వరదయౌ మాకు వినత గీర్వాణి వాణి.**

శ్రీనాథకవిసార్వభౌముని భీమేశ్వరపురాణం లోనిది ఈ వాణీస్తవపద్యం.

సరస్వతియొక్క దేవతాత్మకమైన రూపవర్ణనం ఈ పద్యంలో సుస్పష్టం. ఎత్తుగీతిలో ఉన్న పదాలు కావ్యంలో ప్రతిపాద్యమైన వస్తువును సూచిస్తున్నవి. ఈ గ్రంథంలో వర్ణ్యవిషయం దక్షారామ భీమేశ్వరమహిమ. దుగ్ధపాథోధి.లహరుల్ని మందరాచల కందరంతో మథించే సమయంలో ఉద్భవిల్లిన హాలాహలానికి భీతులైన దేవతల-దేవారుల-భీతి నివారించడానికి వరదుడైన పరమేశ్వరుడు

అనుగ్రహించడం, హాలాహల భక్షణానంతరం శ్రీ భీమేశ్వరుడు దక్షారామక్షేత్రంలో నెలకొనడం అనే ఈ విషయాన్ని వర్ణించేదే ఈ కావ్యం. ఆ భీమనాథుడు భక్తవరదుడూ వినతగీర్వాణుడూను. వాణిస్తుతిలో వస్తుసూచనం లలిత సాహిత్య శిల్పం.

**9**

**ప్రణవ పీఠమున మంత్రపరంపరలు గొల్వ**
**నుండు నే దేవి పేరోలగంబు!**
**భావజ్ఞులకుఁ బరాపశ్యంతి మధ్యమా**
**వైఖరు లే దేవి వర్ణ సరణి!**
**జపహార కీర పుస్తక విపంచి సమంచి**
**తంబు లే దేవి హస్తాంబుజములు'**
**కుందేందు మందార కందళీబృందంబు**
**చంద మే దేవి యానందమూర్తి!**

**కాంచె నే దేవి కాంచన గర్భచతుర**
**పూర్వదంత కవాట విస్ఫుట మనోజ్ఞ**
**చంద్రకాంత శిరోగృహస్థల విహార**
**మ మ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు.**

పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుని రచన ఐన జైమిని భారతంలోని వాగ్దేవీనుతి రూపమైన దీ పద్యం.

దేవతలు మానవులకు అందరకూ మనోనేత్రానికే కాని చర్మచక్షువులకు గోచరమయ్యేవారు కారు. ఆ దేవతల స్వరూపం కూడా రెండు విధాలు. ఒకటి లౌకిక స్వరూపం. రెండవది తాత్త్విక స్వరూపం. ఈ తాత్త్వికస్వరూపం దేవతా తత్త్వవేత్తలకు తెలసినది. దీన్ని సాధారణజనులు గ్రహించి ఆరాధించజాలరు. అందుచేత తత్త్వజ్ఞులు ఆయా దేవతాతత్త్వాలకు లౌకిక భావనానుసారం ఒక్కొక్క స్థానాన్ని కల్పించి వర్ణిస్తారు. భక్తబృందమంతా దాన్నే గ్రహించి ఆరాధించి తరిస్తూ ఉంటారు. ఈ పద్యంలో పినవీరన పలుకులవెలందియొక్క తాత్త్వికస్వరూపమూ లౌకికభావనాగమ్య స్వరూపమూ రెండూ గ్రహించి వర్ణించినాడు. సరస్వతి నిత్యం పద్మాలయాదేవీ; ఆ పద్మమే ఆమె కూర్చుండు పీఠం. అది ప్రణవమే. ప్రణవం

వేదాదియందు ప్రోక్తమైనది. వేదాంతాలయందు ప్రతిష్ఠితమైనది. అద్యంతముల యందున్న ఒకే అక్షరము కావున అది సర్వవేదవేదాంత సమాహారం. సమస్త లౌకిక వాఙ్మయమూ దాని అంతర్భాగమే. వాక్కు దానియందే ప్రతిష్ఠితం. మంత్రపరంపరలు అన్నీ తదిధిదేవతనే ఆరాధిస్తవి. వాఙ్మయం అంతా వర్ణఘటితం. అది చతుర్విధములు పరా, పశ్యంతి. మధ్యమ, వైఖరి. ఈ విషయం శబ్దతత్త్వజ్ఞులకు మాత్రమే తెలిసినది. తత్త్వజ్ఞులకు మాత్రం గమ్యమైన దేవీస్వరూపం ఇది. ఇక లౌకిక భావనాగోచర స్వరూపం. ఆమె హస్తాంబుజములు నాలుగూ జపహార-కీర-పుస్త-విపంచీ సమంచితాలు. జపహారం ఆ అనుష్ఠానసాధనం. అనుష్ఠానం లోక సంగ్రహ ప్రయోజనం. అంతేకాని స్వయంగా వాగ్దేవతకు ఆ అనుష్ఠానంవల్ల తాను సాధించవలసిన దేముంటుంది. కీరం వినోదసాధనం అంతేకాదు. అది సర్వప్రాణులకూ ప్రతీకం. జనులు చిలుకకు మాటలునేర్పి ఆ మాటలే దానినోట విని ఆనందిస్తుంటారు. అట్లాగే సరస్వతికూడా తాను మన కనుగ్రహించిన వాక్కులతో సకలప్రాణులచేతా ఉచ్చావచాలైన పలుకులు పలికిస్తూ విని ఆనందిస్తూ ఉంటుంది. పుస్తకం సాహిత్యానికి చిహ్నం. విపంచి సంగీతానికి గుర్తు. ఆమె శుక్లదేహ అనే విషయం కుందేందు మందార కందళీబృంద మా దేవి ఆనందమూర్తి అని చెప్పబడింది. ఈషద్దుఃఖంతోకూడా సంవలితం కాని బ్రహ్మానంద సబ్రహ్మచారియైన అనిర్వాచ్య నిర్మలానందమే పవిత్రసాహిత్య పరమ ప్రయోజనం. జైమినిభారతంలో కృష్ణుని పరమేశ్వరతత్త్వం సర్వత్ర వర్ణితం. పరమేశ్వరారాధన రెండు విధాలుగా చేయవచ్చు, తత్త్వజ్ఞానంతో భక్తితో. ఒకటి యోగిమాత్ర లభ్యం. రెండవది సర్వసులభం. రెంటికీ గమ్యం ఒకటే. పరమపదప్రాప్తి-శాశ్వతానందానుభూతి.

## 10

పొసఁగ న్నేఁ గృతిఁ జెప్పగాఁ బరిమళంబు ల్చాలకొక్కొక్కచోఁ
గొస రొక్కించుక గల్గె నేనియును సంకోచంబు గాకుండ నా
రసి యచ్చోటికి నిచ్చుఁగాత పరిపూర్ణంబొంద వాగ్దేవి యిం
పెసలారం దన విభ్రమ శ్రవణ కల్హారోదయా మోదముల్.

పిల్లలమర్రి పినవీరన కృతియైన శృంగారశాకుంతలంలోని కృత్యాది సరస్వతీస్తుతి ఈ పద్యం.

బ్రహ్మానంద సహోదరమైన అనిర్వచనీయానంద ప్రభుత్వమే కావ్యానికి లక్ష్యం. సత్కవి ఎప్పుడూ తన కావ్యంలో రసస్ఫూర్తిని సాధించడం మీదనే మనస్సు ఉంచి తత్సిద్ధియందు ప్రయత్నపరుడు కావలె. అదే కావ్యానికి ఆత్మ. కావ్యపుష్పానికి నిత్యానపాయి ఐన సౌరభం. ఇది లేని కావ్యం హేయం. అది కల కావ్యమే సహృదయామోదదమూ. సర్వజన సమాదరణీయమూ. కాంతాసమ్మితమై ఆనందాన్ని కల్గిస్తూ ఉపదేశప్రదమై మానవుని సన్మార్గ ప్రవర్తిగా చేయగలదు. అట్టిది మాత్రమే ఉపాదేయం. రససిద్ధి సాధనలో కవి ఎంత తత్పరుడైనా ఎంత ప్రయత్నపరుడైనా ఒకప్పుడు అందులో కొరత ఏర్పడటం సహజం. అటువంటి సమయంలో దేవతానుగ్రహమే కవికి శరణ్యం. కనుకనే కవి సరస్వతిని ఈవిధంగా ప్రార్థనచేస్తున్నాడు. తాను కృతి చెప్పబూనినప్పుడు దానిలో ఒక్కొక్కచోట రససౌరభం కొరతపడినట్లయితే ఆ వాణి అది గమనించి అటువంటి స్థానాలను తన విభ్రమశ్రవ కల్హారంనుంచీ ఉదయించిన ఆమోదాన్నందించి ఆ కొరతను పూరించాలి అని అతని వేడుకోలు. కల్హారం అంటే రక్తోత్పలం. అది అనురాగానికి ప్రతీకం. కవి వ్రాయబూనిన కావ్యంలో శకుంతల నాయిక. ఆమె నిర్మలానురాగమూర్తి. ఈ కావ్యం పేరు శృంగార శాకుంతలం.

## 11

**వేదాగమరూపమున మ**
**హాదేవు నపారగుణ మహాసంస్తుతి సం**
**పాదిత యగు భారతి నేఁ**
**డాదిగ మత్కృతికి నెలయునది గాక దయన్. 1-11**

నన్నెచోడ మహాకవి రచించిన కుమారసంభవంలోనిది ఈ పద్యం.

ఈ సరస్వతీ ప్రార్థనలో ఒక వైలక్షణ్యం ఉంది. ఈ కవి తాను కావ్యం వ్రాయడం ఆరంభించడానికి పూర్వం వరకూ భారతి వేదరూపాన ఆగమమూల రూపాన మహాదేవుని అపారగుణాలను సంస్తుతి చేస్తూ ఉండినది. అదే ఆమెకు పరమధ్యేయం, జీవితానికి సార్థకతా సంపాదనం. అటువంటి భారతి ఈ కవి కావ్యరచనారంభం చేసిన నాటినుంచీ దయతో తన కృతికి ఎలయవలెనని ఆయన ప్రార్థన. తన కావ్యమాధుర్యానికి ఆకృష్టురాలై ఆమె తన రచనను అనుగమించాలి. పలుకుల వెలది తన కవితా రచనలో చివరవరకూ తనకు తోడుగా ఉండి సరస కావ్యరచనా సంసిద్ధి కలిగించాలి.

ఇక ధ్వనిరూపంగా ఈ అర్థాలు ఇలా స్ఫురిస్తవి.:- తాను వ్రాయబూనిన కుమారసంభవంలో ప్రతిపాద్యమైన విషయంకూడా మహాదేవుని అపారగుణ మహా సంస్తవమే. తారకాసురునిచే బాధలకు లోనైన దేవతలు బ్రహ్మదేవుని ఉపదేశాన్ని అనుసరించి సంఘటితపరచిన పార్వతీపరమేశ్వరకల్యాణమే స్కందుని జన్మకు కారణమై తద్వారా లోకకల్యాణ సంధాయకమైంది.

ఇంతేకాదు. వేదాలలోను ఆగమాలలోనూ ప్రతిపాద్యమైనది మహాదేవుని అపారగుణ మహాసంస్తవమే-మహాదేవుని గుణాల్ని ప్రతిపాదించేదే తన కావ్యం కూడా. అది వేదాలకంటె ఆగమాలకంటె ఏ మాత్రము తక్కువది కాదు. వేదాలూ ఆగమాలూ ఆదరంతో అధ్యయనం చేస్తూ ఉన్నట్లే జనులు తన కావ్యాన్నికూడా పఠించి వేదాగమాధ్యయనంవల్ల పొందే ప్రయోజనాన్నే- అనగా మోక్షప్రాప్తిని పొందవచ్చు."కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అన్న మీమాంసకుల మాటను పాటించి 'యిది కావ్యం కదా' అని వర్జింప తగినది కాదు అని తన కావ్యంలోని గుణోత్కర్షను ఈ రాజకవి రాజఠీవితో చెప్పినట్లయింది ఈ సరస్వతీస్తుతిలో.

## 12

**కరకమలంబునందుఁ బటికంపుఁ గమండలు పచ్చకాంతి భా**
**సురమగు మౌక్తికంపు జపసూత్రము దాల్చుట బ్రహ్మచారియై**
**పరఁగిన హంసమున్ బిలిచి బాల మృణాళముఁ జూపు చందమౌ**
**సిరి దిలకింప నొప్పు బుధసేవిత మూర్తిఁ దలంతు భారతిన్.**

ప్రబంధపరమేశ్వరుని నృసింహపురాణములోని దీ సరస్వతీ ప్రార్థన.

భారతియొక్క ఒక కరకమలమందు స్ఫటిక కమండలువు ఉన్నది. మరొక హస్తపద్మంలో మౌక్తిక జపమాల ఉన్నది. ఈ స్ఫటిక కమండలువు హంసాకృతి కలది. మౌక్తిక జపమాల లేత తామరతూడువలె ధావళ్యంతో వెలుగొందుతున్నది. ఇది చూడగా తనదగ్గర వేదాధ్యేతగా ఉన్న తన వాహనమైన హంసను పిలిచి ఇదిగో నీకు ఆహారము అని చూపుతూ ఉన్నదేమో అని చూపఱకు తోస్తున్నది. బుధులు-కవులు-పండితులు ఎప్పుడూ ఆమెను సేవిస్తూ ఉంటారు. అటువంటి భారతి ఇక్కడ కవికి ఆరాధ్యగా ఉన్నది. ఇది ఎంతో సరసమూ, సరళమూ హృదయంగమమూ ఐన భావం.

స్ఫటిక కమండలువూ మౌక్తిక జపమాలా రెండూ శ్వేతవర్ణాలే-సరస్వతీ శ్వేత వర్ణమే. ఈ విధంగా ఆమె సర్వశుక్ల. దుష్టదానవ పీడితులైన విబుధులు శ్వేత ద్వీప వాసియైన శ్రీ మహావిష్ణువును స్తుతించడంతోనే లక్ష్మీనృసింహపురాణ కథారంభం. హిరణ్యకశిపు వధానంతరం లోకలోచన భయంకరుడుగా ఉన్న ఉగ్రనారసింహుని సిరి చేరినప్పుడే అతడు ప్రసన్నమూర్తియై లక్ష్మీనారసింహుడు. అనబరగి బుధ-విబుధ-సేవనీయుడైనాడు అనే విషయం ఈ పద్యంలోని సిరి-బుధ అనే పదాలు ధ్వనింపచేస్తూ ఉన్నవి.

కమండలువు-అక్షమాల-బుధసేవితమూర్తి -భారతి అనే పదాలనుబట్టి కఽ తన గరువును స్తుతించిన స్ఫూర్తికూడా ఉన్నదని కొందరి భావన. భారతీ సరస్వతీ మొదలైనవి యతుల నామాంతాలుగా ఉండటం సంప్రదాయంగా ఉన్న విషయమే.

## 13

**అరయ నొక్కభంగిగ రహస్యపుఁ జోటను రాజసన్నిధిన్**
**సూరిసభాంతరంబులను జూపుట తప్పక గద్యపద్యముల్**
**దోరలు నేర్పినట్లు మదిఁ దోపగఁజేయుట సంతతంబు నా**
**భారము కాదె వీనికను భారతి మాకుఁ బ్రసన్న యయ్యెడున్.**

మారన విరచితమైన మార్కండేయ పురాణంలోని సరస్వతీ ప్రార్థన ఇది.

భారతి అవ్యాజ కరుణా తరంగితాంతఃకరణ. నిఖిలలోక యోగక్షేమ వహన తత్పర అనే విషయం కవి ఈ పద్యంలో సూచించాడు. ఇదే భావంతోటి కరుణ తనవైపు ప్రసరింపచేయాలని అతని వేడుకోలు. తత్త్వవిచారణలో కాని రాజసన్నిధిలో కాని పండితుల సభాంతరాలలో కాని ఆతనిని ఒకేవిధంగా చూడవలె. ఎక్కడికి తగినట్లు అక్కడ అతని విద్యా, బుద్ధి, వాక్కూ విలసిల్లేటట్లు చూడాలి. కావ్యరచనలో కూడా ఎక్కడికి అక్కడికి తగినట్లు దోరలు నేర్పినట్లు గద్యాలు పద్యాలూ మదిలో తోచేటట్లు చేయాలి. అది అతనికి అనుగ్రహించవలసిన భారం నాదే అనుకొంటుందట భారతి.

మారన గురువు తిక్కనసోమయాజి. ఆయన మొదట ఉత్తరరామాయణం నిర్వచనంగా రచించాడు. అనంతరం భారత రచనలో తన మొదటపద్ధతిని

మార్చుకొని "గద్యముల పద్యములన్ రచియించెదం గృతుల్" అని ప్రతిజ్ఞ చేసి దాన్ని అలాగే చంపూ రూపంలో కొనసాగించాడు. తెలుగులో కావ్యరచనకు ఈ పద్ధతే అనువైందనే సూచనకూడా ఈ పద్యంలోని "గద్యపద్యముల్" అనే దానిలో కనబడుతున్నది.

## 14

**ఏ సతి లావు లేక నరు లెవ్వరు నోరు మెదల్పలేరు ప**
**ద్మాసన వాసుదేవ నిటలాక్షులు లోనుగ నా త్రివిష్టపా**
**వాసులు పుట్టుఁ బేరుఁ జెలువంబును నేరికి డాప రట్టి వా**
**ణీసతి మన్ముఖాబ్జమున నిల్చి విశేషవరంబు లీవుతన్. 1-5**

అనంతామాత్యుడు రచించిన.భోజరాజీయమునందలిది ఈ సరస్వతీస్తుతి పద్యం.

తాను చెప్పదలచిన భావాన్ని అత్యంత ఋజుమార్గంలో స్పష్టాతిస్పష్టంగా చెప్పడంలో అనంతామాత్యుడు సిద్ధహస్తుడు. ఈ పద్యంలో కవి ఇతరు లెవ్వరి మాదిరిగాను సరస్వతియొక్క సంగీత సాహిత్యాత్మక స్వరూపం గానీ దేవతాత్మతను గానీ మరేవిధమైన అలౌకిక సౌందర్యవర్ణనం గానీ చేయలేదు. కేవలం వాగ్దేవియొక్క సామర్థ్యం ఎటువంటిదో తిన్నగా చెప్పి విడిచాడు.

ఈ పద్యంలో అనంతమాత్యుడు వివరించిన మొదటి అంశం ఇది:- ఈ సతియొక్క లావు-అనగా దయతో ఆమె ప్రసాదించిన సామర్థ్యం లేనిదే నరులు ఎవ్వరూ నోరు మెదల్పలేరు. మాటలు రాని మూగివారైపోతారు. ఒకవేళ మాటలు వచ్చినా చాతుర్యంతో మాటాడలేరు. పాండిత్యం వుండికూడా కొందరు కవిత్వం చెప్పలేరు. అందుకు ఆవశ్యకమైన ప్రతిభారూపసామర్థ్యం వారికి ఉండదు. అట్టివారు కవిత్వం చెప్పడానికి నోరు మెదల్పలేరు. కొందరు లౌకిక వ్యవహారసరణిలో అత్యంత దక్షులుగా ఉంటారు. కాని విద్యలలో వైదుష్యం లేనివారు కావచ్చు. అట్టివారు విద్యా విషయాలలో నోరు మెదల్పలేరు. ఈ విధంగా ఈ నోరు మెదల్పడం - మెదల్పలేక పోవడానికి కారణం అనేక రూపాలలో ఉంటున్నది. దీని కంతటికి వారివారి సుకృత దుష్కృతాలని బట్టి లభించిన సరస్వతి అనుగ్రహమే కారణము. ఆమె విద్యాబుద్ధి వాక్సిద్ధులకు అధిష్ఠాత్రి.

ఇక కవి నిరూపించిన రెండవ అంశం: బ్రహ్మ, విష్ణువు, పరమేశ్వరుడు మొదలైన దేవతలుకూడా తమ తమ జన్మ వృత్తాంతమును కాని తమ కీర్తిని ప్రతిపాదించే ఘనకార్యాలకు సంబంధించిన వైశిష్ట్యాన్ని గానీ, సౌందర్యాతిశయాన్ని గాని ఈ వాగ్దేవికి తెలియకుండా దాచలేదు. వీటితోపాటు ఆ యా దేవతల జన్మాది వృత్తాంతాలకు సంబంధించిన గోప్యాంశాలు ఏవైనా ఉంటే వాటిని కాని అప్రతిష్ఠాకరమైన అనుచిత కృత్యాలేవైనా వారు చేసి ఉంటే వాటిని కానివారు వాగ్దేవికి గోచరం కాకుండా దాచలేరు అని ఉపలక్షణంగా చెప్పుకోవచ్చు. ఈ విషయంలో దేవేంద్రుని వృత్రవధావృత్తాంతము, సహస్రాక్షత్వము లోని రహస్యము, కుబేరుని విరూపత్వ వృత్తాంతమూ ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. ఇటువంటి వాణీసతి తన ముఖాబ్జములో నిల్చి విశేషవరముల నీయవలెనని కవి ఆశంస. తాను ఈ కథాకావ్యంలో వర్ణింపదలచిన ఏ అంశంకూడా ఆమె అనుగ్రహం ఉంటే తన బుద్ధికి మరుగుపడదు కాని తన వాక్కుకు స్వాధీనం కాకుండాపోవడం కాని జరుగదని అతని ధృఢవిశ్వాసం. ఈ విషయమే మిల్టన్ మహాకవి.

"Heaven hides nothing from thy view"

అని paradise Lost లో మ్యూజ్‌ను స్తుతిస్తూ చెప్పినాడు. ఈ భావాన్ని అతనికంటె చాల ముందే ఈ తెలుగుకవి భావనచేసి చెప్పడం విశిష్టమైనవిషయం.

## 15

చేర్చుక్కగా నిడ్డ చిన్నిజాబిల్లిచే
సింధూర తిలకంబు చెమ్మగిల్ల
నవతంసకుసుమంబు నందున్న యెలదేంటి
రుతి కించిదంచిత శ్రుతుల నీన
ఘనమైన రారాపు చనుదోయి రాయిడిఁ
దుంబీఫలంబు దుందుడుకు సెంద
దరుణాంగుళిచ్ఛాయ దంతపు సరకట్టు
నింగిలీకపు వింత రంగులీన

నుపనిషత్తులు బోటులై యోలగింప
బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
నించువేడుక వీణ వాయించు చెలువ
నలువరాణి మదాత్మలో వెలయూఁ గాత. 1-5

ఆంధ్రకవితా పితామహుఁడు అల్లసాని పెద్దనామాత్యుఁడు మనుచరిత్ర కృత్యాదిని చేసిన సరస్వతీ ప్రార్థన ఇది.

ఈ పద్యంలో సరస్వతీదేవియొక్క సంగీతప్రియమైన స్వరూపం విస్పష్టంగా వర్ణించబడింది. నలువరాణి పుండరీకాసనమున కూర్చుండి వీణ వాయిస్తూ ఉన్నది. అమె "నిత్యం పద్మాలయా దేవీ" ,"శ్వేతపద్మాసనా" అనే విషయం ఇక్కడ జ్ఞాపకం చేయబడింది.

దీనిలో కవి కావ్యార్థ సూచనం చక్కగా ధ్వనింపజేశాడు. వరూధిని ప్రవరునికి కనబడ్డప్పుడు అమె "అమలమణిమయ నిజమందిరాంగణస్థ తరుణ సహకారమూల వితర్దిమీద శీతలానిల మొలయ నాసీనయై," "ఇంపుదళుకొత్త వీణ వాయించు" చుండినది. ఇటువంటి నిత్య సంగీత ప్రియయైన వరూథినీ మూలకత్వం ఈ కావ్యంలో ప్రతిపాద్యమైన కథావస్తువుకు ఉన్నది-అనే సూచన ఈ పద్యంలో స్ఫురిస్తున్నది.

ఇక్కడ మరొక విశేషార్థం కూడా స్ఫురిస్తున్నది. సంగీతం మోక్షసాధనాల్లో ఒకటి. అది కైవల్యసిద్ధికి సుకుమారమైన మార్గం. నారదాదులు ఈ మార్గం అనుసరించినవారే. సరస్వతికూడా ఆ మార్గాన సాధకురాలు కావడంలో ఆశ్చర్యంలేదు. తపస్సిద్ధికి వ్యాఘ్రచర్మాసనం శ్రేష్ఠమైంది. అమె పుండరీకాసనమున కూర్చుండి వీణ వాయింపు చుండినది. పుండరీకం అంటే వ్యాఘ్రం అని కూడా అర్థం. పరతత్త్వ ప్రతిపాదకాలైన ఉపనిషత్తులు మూర్తములై బోటులుగా ఐ ఆమెను ఓలగింపుచుండినవి. ఆమె మధురగానం తనకూ శ్రోతృజనానికీకూడా మదికి నించుచుండినది. ఆత్మానంద సంధాయకమై వెలుగొందుచున్నది. ముందరి కథావస్తువులో వరూధిని "ఆనందో్బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా" అని ఆపరాని వలపుతో ప్రవరుని రెచ్చగొట్టడానికి యత్నించింది.

దానినికూడా లెక్కపెట్టక "మోక్ష లక్ష్మీపద్యాగమసూత్ర పంక్తికివె పోమీ సంప్రదాయార్థముల్" అని సమాధానం చెప్పి నిర్వికారచిత్తుడై నిలిచాడు ప్రవరుడు. అతడు అనుదినమూ వ్యాఘ్రాజినంమీద కూర్చుండి ఆత్మానందమనే లక్ష్యం సిద్ధించడానికి అనుష్ఠానం చేసేవాడై ఉంటాడని ఊహించడం పొరపాటు కాదు.

## 16

**మేలిమి మంచుకొండ నుపమింపగఁ జాలిన యంచ నెక్కి వా**
**హ్యాళి నటించివచ్చు చతురాస్యు నెదుర్కొని నవ్వు దేరగా**
**వాలిన సోగకన్నుల నివాళి యొనర్చి ముదంబు గూర్చు వి**
**ద్యాలయ వాణి శబ్దముల నర్థములన్ సతతంబు నా కిడున్.**

మొల్లరామాయణంలోనిది ఈ సరస్వతీస్తోత్రం.

అత్యంత నిర్మల సరసభావ రమణీయం ఈ పద్యం. వాణి విద్యాలయ. విద్య అంటే పరతత్త్వజ్ఞానం అని ఒక అర్థం . వేదవేదాంగాది సమస్తలౌకిక విద్యలూ తత్సంబంధ సమస్త లౌకిక వాఙ్మయమూ అని మరొక అర్థం. కావ్యరచన కూడా ఆ విద్యలలోనిదే. కావ్యాంగాలైన శబ్దాలూ అర్థాలూ సరస్వతీ అధీనంలోనే ఉంటవి. ఆమెకు అనుగ్రహం కలిగితే చాలు మధురాతి మధురార్థ ప్రతిపాదకాలైన పదజాలం తన ఉపాసకులకు ఈయగలదు ఆమె. ఈ విషయాన్నే తులసీదాసు తన రామచరితమానసంలో " వర్ణానా మర్థసంఘానాం రసానాం ఛందసామపి, మంగళానాం చ కర్తారౌ వందే వాణీ వినాయకౌ" అని చెప్పినారు.

కవయిత్రి వ్రాయబూనిన కావ్యం రామాయణం. దానికి వాల్మీకి ఇచ్చినవి మూడు పేర్లు:- రామాయణం-పౌలస్త్యవధం-సీతాచరితం. "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్, పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః," (రామా-బాల-3వ సర్గం). వీటిలో సీతాచరితం అనే పేరు గ్రహించినప్పుడు సీతాదేవి కథానాయిక అవుతున్నది. ఆమె తన అసూర్యం పశ్యత్వాన్ని అంతః పురసౌఖ్యాన్ని అనాదరించి ఆత్మేశ్వరుని అడుగు జాడలవెంట అడవుల కేగింది. తన ముద్దుల మఱది లక్ష్మణుడు కూడా తమవెంటనే అనుసరించి వచ్చాడు. అనుదినమూ ఆహార సంపాదనానికో ఆశ్రమవాసుల అనుష్ఠానాదికం నిరాతంకంగా జరుగుతూ ఉన్నదా లేదా అనే పర్యవేక్షణకో సోదరులిద్దరూ

కాననసంచారంచేసి తిరిగి వచ్చేవారు. లక్ష్మణుని శరీరం ధవళకాంతి భాసితం. అతడు అనుసరించి వస్తూఉండగా వాహ్యాళి నటించి వచ్చు ఆత్మనాథుని ఎదుర్కొని నవ్వుదేరగా వాలిన తన సోగకన్నులతో ఆ మర్యాదా పురుషోత్తమునికి నివాళియొనర్చి ముదంబుగూర్చు పతివ్రతాశిరోమణి, పవిత్రానురాగమూర్తి ఐన సీత ఈ పద్యంలో స్ఫురిస్తూన్నది.

## 17

**చెక్కిటఁ బత్రవల్లరి సృజింపగఁ బూని మనోజ కేళి నా**
**యక్కరఁ దీర్పవే యనుచు నక్షరపంక్తి లిఖింపగాఁ దద**
**న్యకృత కైతవంబు హృదయంబున నారసి ప్రాణనాథుతో**
**నొక్కపిసాళి నవ్వు పస (నన) లొత్తగ నవ్వెడు వాణిఁగొల్చెదన్.**

కందుకూరి రుద్రకవి రచించిన నిరంకుశోపాఖ్యానంలోని సరస్వతీ ప్రార్థన ఇది.

చతుర్ముఖుడు వాణి చెక్కిట పత్రవల్లరిని లిఖించడానికైతే పూనుకొన్నాడు. కాని తాను చేసినపని అదికాదు. మనోజకేళి నా యక్కర దీర్పవే అనే అక్షరపంక్తి లిఖించినాడు, ఆ చెక్కులమీద, ఆయన చేయఁబూనిన పని ఒకటి. చేసిన పని ఇంకొకటి. ఈ కిటుకు తెలుసుకొన్నది సరస్వతి. ఒక్క పిసాళినవ్వు నవ్వింది.

ఈ విధంగా కవి సరస్వతీ ప్రార్థనను వాణీ చతుర్ముఖుల కామ లీలా విలాస వర్ణనతో ముంచివేశాడు. ఎంత మధురమైనా ఇది తార్తీయ పురుషార్థం. దీనికి అతిగా దాసుడు కావడం క్షేమకరం కాదు, దీనినిబట్టి ఈ కావ్యంలోని విషయం ఊహించవచ్చు. మధురమైన శృంగారరసం ఈ కావ్యంలో వర్ణ్యం. నాయకుడు నిరంకుశుడు రసపరిపోషణ ఏ స్థాయికి చేరుకుంటుందో ఈ సరస్వతీ ప్రార్థనమే చెప్పుతున్నది.

## 18

**బలు తెలి పుల్గు వారువము బంగరు వీణియ మిన్కు టందెలున్**
**జిలుక తుటారిబోటియును జిందపు వన్నియ మేనుఁబొత్తమున్**
**జెలువపుఁ దెల్ల దమ్మివిరి సింగపు గద్దెయుఁ గల్గి యొప్పు ని**
**ప్పలుకులచాన జానలరు పల్కు లొసంగెడుఁ గాత నిచ్చలున్. 1-6.**

కూచిమంచి తిమ్మకవి రచించిన నీలాసుందరీ పరిణయములోని దీ సరస్వతీ ప్రార్థన.

ఈ కావ్యం పేరు తత్సమంగా ఉన్నా కావ్యంలోకి పోతే రచన అంతా అచ్చ తెలుగు. అంటే కావ్యంలోని పదజాలమంతా తద్భవాలో దేశ్యాలో తప్ప తత్సమపదాలు లేనేలేవు. అవే అచ్చ తెనుగుపదాలతో ఈ వాణిస్తుతి నడిచింది.

ఈ పద్యంలోని కొన్ని పదాలకు అర్థం అపేక్షితం కావచ్చు. బలుతెలిపుల్గు = మిగుల తెల్లనైన పక్షి-హంస; వారువము=అశ్వము; చిందము అంటే శంఖము. చెలువపుఁ దెల్లదమ్మివిరిసింగపు గద్దె అనగా అందమైన తెల్లదామర సింహాసనమూ అని అర్థం; పలుకులచాన వాక్కులకు అధిదేవతయైన స్త్రీ-సరస్వతి. అటువంటి తల్లి దయవల్ల తాను రచింపబోయే ఈ అచ్చతెనుగుకబ్బం తెలుగువారి మన్ననలకు పాత్రం కావాలి. ఆమె అందుకు కావలసిన జానలరు పల్కులను కటాక్షించాలి అని కవి ఆకాంక్ష. ఆ అచ్చతెలుగు పలుకులు తెలుగువారికి వినగానే చూడగానే అర్థమయేలా వుండాలి. సహజత్వం కనబడాలి. అంతేకాని పలుకుల రూపంలో కాని కూర్పులో గాని తెచ్చికోలుతనం కనబడరాదు. ఈ పద్యమే అందుకు సాక్ష్యం. (ఆమె దేహకాంతిలో ఉన్న చిందపు తెల్లదనం ఆమె కరాంగుళుల స్పర్శలో స్వనించే స్వర్ణవీణానాద మధురిమ, అందెల రవళి, చిలుక పలుకులలో ముద్దు, ఆమె వాహనమైన హంస నడకవలెనె ఒయ్యారంపునడకా ఈ పద్యంలో నిండారి ఉన్నై.) సరస్వతిని ప్రార్థించినా ఇటువంటి పద్యాలతోనే ప్రార్థించాలి అని ఏ బాలకవి ఐనా ముచ్చటపడతాడు ఈ పద్యం చూడగానే.

## 19

**తన హృదయాంబుజాతమునఁదార్కొను నాథగతానురాగ వా**
**హిని వెలిఁగ్రమ్మఁ జేసెనొకొ యీ గతినాగ విధాత చెంగటన్**
**దనరి జపాప్రసూన సవిధ స్ఫటికాకృతి రక్తిఁగుల్కు వా**
**గ్వనజదళాక్షి మాకొసఁగుఁ గాత వచోరచనా చమత్కృతుల్.**

కంకంటి పాపరాజు రచించిన ఉత్తర రామాయణములోని సరస్వతీ ప్రార్థన యిది.

బ్రహ్మసన్నిధిలో ఉన్న సరస్వతీ రూపంలోని వైశిష్ట్యం కవి చమత్కారంగా వర్ణించా డీ పద్యంలో. బ్రహ్మదేవుడు రజోగుణమూర్తి, రక్తవర్ణుడు. సరస్వతి

శుక్ల వర్ణ. ఈ కూడిక ఎంతో విలక్షణమైంది. శారద తన మనస్సులో తన నాథుని విషయంలో ఉన్న అనురాగాన్ని బహిర్గతం చేసింది. రాగమూ రక్తవర్ణమే. అది బ్రహ్మదేవునిపై వ్యాపించి అతని దేహం అరుణవర్ణమైనదేమో అని చూపఱకు అనిపిస్తూ ఉన్నది. ఎర్రని జపాప్రసూన సవిధంలో ప్రకాశించే స్ఫటికంవలె ఉన్నదట భారతీరూపం. ఆమె తానెంతో తెల్లదైనా తన పతి దేహకాంతి ఆమె దేహకాంతికి కొంత అరుణిమను ప్రసాదించిందన్న మాట. అందుచేతనే ఆమె రక్తితో-రక్తవర్ణంతో-రజోగుణ పరిణామమైన అనురాగంతో-కుల్కుతూ ఉంటుంది. లేకపోతే ఆమె సర్వశుక్ల దేహ, సాత్త్వికతామహిత చిత్త. ఆమె చిత్తంలో రాగద్వేషాలకు తావు లేదు-అని భావం. అటువంటి వాణి కవికి చమత్కారమహితాలైన వాక్కులను, ప్రసాదించవలెనని ఆకాంక్ష. కేవల వస్తుమాత్ర ప్రతిపాదకాలైన కావ్యాలు, ఇతిహాసతుల్యాలై మనోహ్లాద జనకాలు కావు. సాహిత్య ప్రియులకు ఉపాదేయాలు కావు. వాటిలో చమత్కారం ఉన్నప్పుడే అవి సహృదయ మనోరంజకాలు అవుతవి. వస్తు ప్రతిపాదకత్వంతోపాటు చమత్కారం కలసిఉండటం కూడా పైన వర్ణించిన వాణీ బ్రహ్మల సాహచర్యంతో సమానమైనదే.

## 20

**వీణాపుత్త్రి లసద్గుణంబులు ముదావిర్భావముం జేయఁగా**
**బ్రాణంబుంబలె తొమ్ము డించక సుధాప్రాయానులాపంబులన్**
**బాణిం గూర్చుచు సారెసారెకు రుచుల్పాటింపఁ బల్కించు న**
**వ్వాణీదేవి నటించు మద్విముల జిహ్వారంగ మధ్యంబునన్. 1-8.**

సారంగు తమ్మయ రచించిన వైజయంతీవిలాస కావ్యమునందలి సరస్వతీ స్తుతి పద్యమిది. ఈ వైజయంతీవిలాసానికే విప్రనారాయణ చరిత్రమని నామాంతరము.

వాణికి తన వీణాపుత్త్రియొక్క లసద్గుణంబులు ముద్దు కూరుస్తూ ఉన్నవి. అందుచేతనే ఆ పుత్త్రిని ఆమె ప్రాణంతో సమానంగా చూచుకొంటూ ఉంది. ఆ బిడ్డను ఎప్పుడూ తన తొమ్మునుండి దించదు. తన పాణితో సారెసారెకు మీటి ఆమెచేత రుచులు పాటించే సుధాప్రాయానులాపాలు పలికిస్తూ ఉంది. అటువంటి వాత్సల్యపూర్ణురాలైన వాణి తన జిహ్వా అనే రంగమధ్యాన నటించాలి అని కవి ప్రార్థన.

పరమేశ్వరుని ఇటువంటి సహజ వాత్సల్యాన్ని ద్యోతనచేసేదే ఈ కావ్యంలోని కథావస్తువు. లోకమంతా ఆయనకు సంతానం. వారిమీద ఆయనకుగల వాత్సల్యం అపారం. విలక్షణం, వారి చేతలు ఆయనకు ముచ్చట కలిగిస్తూ ఉంటాయి. వారి ఆనందం ఆయనకు ఆనందకరం. కనుకనే ఆ యా జీవులకు వారివారి ప్రారబ్ధం అనుభూతమైపోయి వారు ప్రక్షీణ కర్మాంతరులైన తరువాత వారికి తన శాశ్వత స్థానం ఇస్తాడు. ఈ కావ్యంలోని విప్రనారాయణుడు ఇటువంటి పరమేశ్వరానుగ్రహానికి పాత్రుడైనవాడే.

## 21

**కరములు గూర్చి మ్రొక్కెద జగన్నికురుంబ కుటుంబకున్ సుసుం**
**దరదరహాస వైభవ సుధారసధారిముఖేందుబింబకున్**
**స్థిరకరుణావలంబ కహిసిద్ధసురాసుర చారణార్చిత**
**స్ఫురదరుణాంఘ్రి తామరస శోభికదంబకు శారదాంబకున్. 1-9.**

## 22

**చేతులు సాచి మ్రొక్కెద నశేష జగజ్జన రక్షణ క్రియా**
**హేతు కృపావలంబకు భహీర పటీర తుషార చంద్రికా**
**జాతయశః కదంబ కటిచారుమణీరశనానితంబకున్**
**ధ్యాతృమనోవిడంబకు విదంభమదంబకు శారదాంబకున్. 1-10.**

చింతలపల్లి ఛాయాపతి కవి రచించిన రాఘవాభ్యుదయంలోనివి ఈ రెండు సరస్వతీ ప్రార్థన పద్యములు.

ఈ రాఘవాభ్యుదయం ప్రౌఢకావ్యం. అందుచేతనే ఈ పద్యంలో పదకాఠిన్యం హెచ్చు. కవిలో వ్యుత్పత్తి అంశము అధికతరము. ఇట్టి కవితారచనలు కూడా ఒక విధంగా ఆనందదాయకాలే. ఐతే అధికారి భేదాన్నిబట్టి, ఇటువంటి వ్యుత్పత్తి ప్రధానమైన రచనా విశేషాన్ని గురించే త్రివిక్రమభట్టు

"కావ్యస్యామ్రఫలస్యేవ కోమలస్యేతరస్య చ,
బంధచ్ఛాయా విశేషేణ రసో-ప్యసదృశో భవేత్."
వాచః కాఠిన్య మాయాన్తి భంగశ్లేషవిశేషతః,
నోద్వేగ స్తత్రకర్తవ్యో యస్మాన్నైకోర స:" అన్నాడు.

ఈ పద్యాలు రెండు పోతనామాత్యుని పద్యాలవలెనే అంత్యాను ప్రాస అలంకారంతో రమ్యంగా ధారాశుద్ధి నంశోభితంగా ఉన్నై. వీటిలో వృత్త్యనుప్రాసంగూడా చోటు చేసుకున్నది. దీర్ఘసమాసాలు పద్యాల నడకకు ఒక ఠీవిని సమకూర్చినై. వీటిలో కొన్ని కఠినపదాలు ఇవి. నికురుంబం=సమూహం, కదంబం=సమూహం-అవయవ సంహతి అనగా శరీరం. భం = నక్షత్రం = విడంబ, సాక్షాత్కరించునది ప్రత్యక్షమగును. (Ref.Kittel)

## 23

**నెమిలికి నాట దిద్దు వగ నెయ్యపుఁ జిల్కకు గానమాధురిన్**
**దమి యిడు నేర్పు నీకు విదితంబగు, నింక విరాళి చాలి గా**
**త్రమున రహింప జాలుట గదా యరుదంచు విరించి మెచ్చ హా**
**సము నును వాతెఱం జొనుపు శారద పొల్పుఁ గృతీంద్రసూక్తులన్.**

కార్వేటినగర సంస్థాన విద్వత్కవి-ఋగ్వేది కవి వేంకటాచలపతి కవి రచించిన చంపూ రామాయణం -(భోజుని చంపూ రామాయణానికి అనువాదం)-లోనిది ఈ సరస్వతీ ప్రార్థన పద్యం.

నెమిలికి ఆటనేర్పడం, లీలాశుకానికి గాన మాధుర్యంలో ఆసక్తి కలిగించి శిక్షణ ఇవ్వడం -ఈ రెండు విషయాల్లో నీ ఘనత నాకు తెలుసు. నీవు గాత్రంతో గానంచేస్తేవిని ఆనందించాలి అని ఉంది అని ఒక అర్థం. నీవు వాల్మీకి నాటినుంచీ నేటివరకూ ఆ యా కవులదగ్గరనే ఆసక్తితో ఉంటూ నా గాత్రానికి సన్నిహితురాలుగా ఉండటం, ఆనందాన్ని ఈయడం అరుదైపోయినది. అని మరొక అర్థం. ఈ విధంగా గాత్రశబ్దంతో బ్రహ్మ చూపిన ఆశ్లేషానికి తన విషయంలో నాథునికి అకారణంగా కలిగిన అసూయకు సరస్వతి నునువాతెఱమీద హాసము చొనిపినది. అటువంటి శారద కృతీంద్రుని సూక్తులలో పొల్చును గాక! అని ప్రార్థన. కృతము అనగా కృతి-రచన-అది కలవాడు కృతి - (కృతి - కవి - కృతీంద్రుడు. కవీంద్రుడు తానే అని ఒక అర్థం. కృతికి ఇంద్రుడు కృతిపతి అని ఇంకొక అర్థం.

ఇక్కడ పై భావంలో బ్రహ్మకు సరస్వతిమీద అసూయ కలగడాన్ని గురించి చంపూ రామాయణంలో ఇలా ఉంది. వాల్మీకి తమసానదినుంచి ఆశ్రమానికి మరలివచ్చి అంతకుముందు తననోట వెలువడిన.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్."

అనే శ్లోకాన్ని గురించి ఆలోచిస్తూ ఉన్నాడు. ఆ సమయంలో బ్రహ్మ అతని ముందు సాక్షాత్కరించాడు. సరస్వతి అంతవరకూ బ్రహ్మ దగ్గరనే ఉంటూ ఉంది. ఇప్పుడు ఆమె వాల్మీకిదగ్గర తనవిలాసాలు చూపింది. అది సహించలేక ఆయన వాల్మీకి ఎదుటికి వచ్చాడా? అన్నట్లున్నది అని భోజుడు ఉత్ప్రేక్షించాడు. "వాణీవిలాస మపరత్ర కృతోపలంభ మంభోజభూ రసహమాన ఇవావిరాసీత్."

## 24

శారద చంద్ర చంద్రికల చాయల మాయలఁ బెట్టి మైసిరుల్
సారస గర్భుమేన విరజాజులుగా దనమేన భక్తి శా
రీర విభాళ హల్లకపరిస్ఫురణం బిడ రాగమూర్తి యౌ
శారద మద్వచఃస్థితి విశారదయై విలసిల్లు గావుతన్. 1స్కం.7

చమత్కార మహనీయమైన ఈ సరస్వతీ ప్రార్థన ములుగు పాపయారాధ్యులు రచించిన దేవీభాగవతం లోనిది,

ఈ పద్యంలో కవి శారదను రాగమూర్తినిగా వర్ణించి ప్రశంసించాడు. బ్రహ్మదేవుడు రజోగుణ ప్రధానుడు. అరుణ వర్ణదేహుడు .శారద సర్వశుక్ల. వారిద్దరి సంయోగ చమత్కృతి ఈ పద్యంలో వర్ణితం. శరత్కాలపు చంద్రుని చంద్రికల కాంతులను మించిన తెల్లదనం కల శారదయొక్క మెయిసిరులు సారసగర్భుడైన బ్రహ్మమేనియందు ప్రవేశించి విరజాజిపూలుగా భాసిస్తున్నవి. అతని దేహకాంతులు శారద దేహాన వ్యాపించినప్పుడో? హల్లకపు పరిస్ఫురణము ఇస్తున్నవి. "హల్లకం రక్తసంధ్యకమ్" అని అమరుడు. ఈ విధంగా ఆమె దేహంమీద వ్యాపించిన ఎఱ్ఱకలువ కాంతులు ఆమెను రాగ మూర్తినిగా చేసినవి. రాగమూర్తి అంటే ఎర్రని స్వరూపం కలది అని ఒక అర్థం. అనురాగమయస్వరూపిణి అని మరొక అర్థం. శుద్ధ సత్త్వప్రధానమైన వాక్కులు కేవలం మోక్షప్రదాయకాలైన

ఉపనిషదాదికం. సహృదయ చిత్త చమత్కార సంపాదక కావ్య ప్రతిపాదిక శబ్దసముదాయం అటువంటివి కావు. అవి లోకప్రవృత్తి ప్రబోధకాలై జనులకు ఉపదేశప్రదాలుగా ఉండి వారిని సన్మార్గగాములుగా చేయగలవు. చమత్కారహీనములైన కవివాక్కులకు ధర్మాన్ని ఉపదేశించేశక్తి ఉన్నా వాటిలో ఆకర్షణీయత్వం రామణీయకం ఉండవు. సహృదయులు వాటిని పఠించడానికి ప్రవృత్తులు కారు. ఈ దేవీభాగవతంకూడా మోక్షప్రదాతృత్వం ప్రధాన ధ్యేయంగా కలది కావడంతోపాటు కావ్యత్వం కలదై పఠనాసక్తి కలిగించేదిగా ఉండాలి అని కవి ఆకాంక్షిస్తున్నాడు.

## 25

తన మృదు గీతికా పరిణతధ్వని వైఖరిఁ బల్కుమంచు నిం
చిన రహిఁ జేతి వీణియకుఁ జెక్కులు గీటుచు నేర్పులీల నా
య్యన నఖరాంకురంబుల నయమ్మున దంత్రులు మీటి గాన మిం
పొనరగఁ జేయు వాణి ప్రతిభోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. 1-5

నంది తిమ్మన రచించిన పారిజాతాపహరణ కావ్యంలోని సరస్వతీ స్తుతి ఈపద్యం.

సంగీత ప్రియ-వీణావాదన నిపుణ ఐన వాణిని స్వపుత్రీ లాలన లాలస ఐన మాతృమూర్తినిగా వర్ణించాడు కవి ఈ పద్యంలో.

వాణి కృతిపతి ఐన రాయలనూ -అతనితోపాటు కృతికర్తనూ-కృతిపఠితలనూ కూడా ప్రతిభోన్నతులనుగా చేయవలెనని తిమ్మన ఆశంస. ఆమె తన నఖరాంకులతో నయమ్మున వీణాతంత్రులను మీటి ఇంపొనర గానం చేస్తూ ఉన్నది. తల్లి తన గారాబుపట్టిని వాత్సల్యాతిశయంతో ఒడిలో ఉంచుకొని చెక్కులు గీటుతూ తాను మాటలు పలికి ఆ మాటలు తన బిడ్డకు నేర్పుతుంది. ఆ పసిపాప ఆ పలుకులనే తిరిగి పలికినప్పుడు ఆ మాతృహృదయం ఆనందపరవశం ఔతుంది. ఇది లోక సహజమయిన విషయం. సరస్వతి తన నఖరాంకురాలతో వీణ మీటడంకూడా అలాగే. తన వీణాపుత్రిని గారాబంతో ఒడిలో ఉంచుకొని చెక్కులు గీటి బుజ్జగిస్తూ తాను పాడిన మృదుగీతికా పరిణామమైన ధ్వని వైఖరులను పలకడం నేర్పుతున్నట్లు తోస్తున్నది-శిశువుల తొక్కు పలుకులు స్పష్టంగా ఆ యా

వర్ణాలను వినిపింప జేయలేక పోయినా అవి పెద్దలకు అనిర్వచనీయమైన ఆనందాన్ని ఈయడం సహజం. అదే మాదిరిగా జంత్ర సంగీతం, గాత్ర సంగీతమంత సువ్యక్తరూపం కాకపోయినా శ్రోతలకు అది అమందానంద సంధాయకంగానే ఉంటుంది. ఈ పారిజాతాపహరణ కావ్యంలోని కవిత కూడా ఈ రెండింటివలె రసికులకు ఇంపు కలిగిస్తుందనే విశ్వాసం ఈ పద్యంలో కవి ప్రకటిస్తున్నాడు. "ముక్కు తిమ్మనార్య ముద్దుపల్కు."

## 26

ఒకటి యక్షరవిలాసోల్లాసమున మించ
నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల,
నొక్కటి నారికేళోన్నతిఁ దాల్చ నొ
క్కటి గోస్తనీ గుచ్ఛ కలనఁ దనర,
నొకటి సువ్యక్త భావోన్మేష మొంద నొ
క్కటి వల్లకీ తుంబి కలనఁ జెలఁగ,
నొకటి భారవిశేషయుక్తిఁ బెంపొంద నొ
క్కటి గిరీశమతానుకారి గాఁగ,

నసమ సంగీత సాహిత్య రసము లనెడు
గుబ్బ పాలిండ్లు గల్గు పల్కులవెలంది
సరసగుణహారు నోబయ నరస ధీరు
నవ్యకృతి నాయకునిగా నొనర్చుఁగాత. 1-4

రామరాజభూషణుడు రచించిన నరసభూపాలీయ మనే అలంకారశాస్త్ర గ్రంథంలోనిదీ పద్యం.

దీనిలో కవి "సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్, ఏకమాపాత మధుర మన్యదాలోచనామృతమ్" అనే శ్లోకార్థాన్ని విశదీకరించినాడు.

అసమానమైన సంగీతరసం సాహిత్యరసం ఈ రెండూ పల్కులవెలంది-రెండు గుబ్బపాలిండ్లు. ఈ రెండింటిలోనూ సాహిత్యరసస్వరూపం ఇలాంటిది. అక్షరముల విలాసోల్లాసంతో మించడం దాని మొదటి లక్షణం. మించు ధాతువుకు గల అర్థాలు అతిశయించి ఉండడం-ప్రకాశించడం-రెండూను, అక్షరఘటితాలు

పదాలు, పదఘటితాలు వాక్యాలు. రసాత్మక వాక్యము కావ్యము అనీ రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దమే కావ్యం అనీ మతభేదంచేత కావ్యలక్షణాలు. శ్రవణపేయమైన అక్షరాలు కూర్పు మనోహరార్థంతోపాటు కావ్యశోభాదాయకం. నారికేళఫలానికిగల ఉన్నతివంటి ఉన్నతి కలిగిఉండడం రెండవ లక్షణం. నారికేళం చాలా కఠినమైంది. కావ్యపాకాలలో నారికేళపాకం బహుజనాదరణీయం కాదు. కావ్యగత గంభీర భావాలు అనేక విధముల మననం చేస్తేకాని గ్రాహ్యం కావు అని ఇక్కడ అభిప్రాయం. అంతేకాని కఠినపాకం అని కాదు. సువ్యక్తమైన భావాల ఉన్మేషం కలిగి ఉండడం మూడవ లక్షణం. సువ్యక్త-అంటే సుస్పష్టమైన అని ఒక అర్థం. చక్కని వ్యంజనావృత్తిచే గమ్యమైన-అని మరొక అర్థం. అటువంటి భావాన్ని ప్రతిపాదించే కావ్యాలే సహృదయ హృదయాహ్లాదకాలై శాశ్వతంగా వెలుగొందగలవి. భారవిశేషయుక్తితో చెలగి ఉండడం సాహిత్యపు నాలుగవ లక్షణం. భారశబ్దం గౌరవశబ్దం పర్యాయాలు. అర్థగౌరవమే కావ్యానికికూడా గౌరవదాయకం.

ఇక్కడ విరుపునుబట్టి భారవి-శేష-అనే పదాలు స్ఫురిస్తున్నవి. వీరిలో భారవి (భారవేరర్థ గౌరవం) అనే ఆభియుక్తోక్తికి పాత్రుడైనవాడు. శేషుని అవతారం పతంజలి. అతని రచన వ్యాకరణ మహాభాష్యం. అది వ్యాకరణగ్రంథమైనా సాహిత్యరచనవలె మధురతాభరితమై అధ్యేతలకు అధ్యాపకులకూ గూడా ఆనందాన్ని ఇచ్చే ఘనతనీ కల్గించేది. "మహారాజ్యం వా పాలయేత్ మహాభాష్యం వా పాఠయేత్" అనే పెద్దల మాటకు మూలమైంది. సాహిత్యం అంటే అలా ఉండాలి అన్నమాట.

ఇక రెండవదైన సంగీతరసం మాట. తాళప్రౌఢితో ఉల్లసిల్లడం మొదటి లక్షణం. . సంగీతానికి తాళం ఎంత ముఖ్యమైనదో తెలిసినదే. గోస్తనీగుచ్ఛకలనతో తనరుట రెండవ లక్షణం. గోస్తనీ-అంటే-ద్రాక్షాఫలసదృశమైంది. పాటలో ఉండే అర్థం గృహీతం ఐనా కాకపోయినా సంగీతశాస్త్రం తెలిసినా తెలియకపోయినా విన్నవెంటనే ఆనందం ఇచ్చేది సంగీతం. శిశువునూ పశువునూ ఫణినీకూడా లోగొనేది సంగీతం. అది ఆపాతమధురం. వల్లకీతుంబికలనతో మ్రోగడం మూడవ లక్షణం. తుంబీఘటితమైన వీణయొక్క నాదమాధుర్యం సర్వజనవిదితం. గిరీశమతానుకారిగా ఉండసం నాలుగవ లక్షణం . గిరీశుడు-అనగా సదాశివుడు.

సంగీతశాస్త్ర ప్రవర్తకులలో మొదటివాడని సంగీత రత్నాకరం. "సదాశివః శివా బ్రహ్మా భరతః కశ్యపో మునిః.... అన్యే చ బహవః పూర్వే యే సంగీత విశారదాః"

ఈ విధంగా సరస్వతీ స్వరూపాన్ని వివరించాడు రామరాజభూషణుడు. అతడు తానుకూడా సంగీత సాహిత్య ప్రవీణుడు. తన కావ్యంలోకూడా ఈ లక్షణాలు సమగ్రంగా ఉంటవి అనే విషయాన్నీ సూచిస్తూ కావ్యం అంటే ఇలా ఉండాలి అని వ్యక్తం చేశాడు, ఈ విధంగా ఆ ప్రతిభావిభాసితమూర్తి.

## 27

**రమణీయాక్ష సరాకృతిం బొలుచు వర్ణశ్రేణి వీణానులా**
**పముచేతం గరగించి యందు నిజబింబంబొప్ప నచ్ఛామృత**
**త్వము నాత్మ ప్రతిపాదకత్వమును దద్వర్ణాళి యందెల్లఁ బూ**
**ర్ణము గావించిన వాణి తిర్మలమహారాయోక్తిఁ బొల్చుం గృపన్. 1-4**

రామరాజభూషణుడు రచించిన వసుచరిత్ర ప్రబంధంలోని సరస్వతీ ప్రార్థనమిది. వాణియొక్క కరకమలంలో వెలుగొందే అక్షమాల మాతృకాత్మకమైనది. ఆమెచేసే వీణానులాపమాధుర్యానికి ఆ అక్షమాలలోని వర్ణరూపమైనమణులు కరగినవి. తరళములైన ఆ మణులలో వాణియొక్క బింబం ప్రతిబింబితమయింది. అక్షములైన వర్ణాలు అచ్ఛమైన అమృతత్వాన్ని పొందినై. అవి కరగి నీరుగా మారినై. నీటికి అమృతం అనేది పర్యాయపదం. ఆత్మ అంటే తాను అని అర్థం. ఆ వర్ణాలు తన-వాణీ యొక్క -బింబాన్ని తమలో చూపినై అని ఒక అర్థం. మాతృకాత్మికయైన సరస్వత్యారాధనం జనులకు అమృతత్వాన్ని-మోక్షాన్ని- సమకూరుస్తుంది అనే ఆత్మతత్వాన్ని తెలుపుతుంది అని మరొక అర్థం. ఈ అర్థాలు శబ్దశక్తివల్ల ధ్వనిరూపంగా లభిస్తున్నాయి. ఇటువంటి శక్తిగలిగిన అక్షమాలను ధరించిన వాణి తిరుమల మహారాయల ఉక్తులలో-వాక్కులలో-ప్రకాశించవలెనని కవి ఆకాంక్ష. కృతి భర్తయైన తిరుమలమహారాయల ఉక్తులుకూడా అమృతంవలె నిర్మలంగానూ, మధురంగానూ ఉండి జనులకు ఆ అమృతంవలెనే జీవాన్నీ ఇచ్చి మనుపవలెను. ఆ ఉక్తులు అతి స్పష్టంగా శక్తివంతముగా ఉండి అతని ఆత్మను ప్రతిపాదించేవిగా-అనగా వ్యక్తిత్వాన్నీ, మహత్వాన్నీ సూచించి అతని అదృశ్యత్వానికి అభిగమ్యత్వానికి ప్రతీకాలుగా ఉండవలెనని భావం. ఇటువంటి

వాక్కులే లోకకల్యాణ సంధాయకాలు. సరస్వతీకటాక్షం సంపూర్ణంగా పొందినవారికే మహనీయమైన ఇట్టి ఉక్తి విశేషాలు లభిస్తవి. సామాన్యులకు లభించవు. ఈ విధంగా కవి ఇక్కడి కృతిపతిని ఉపలక్షణంగా చూపి చేసిన ఆశంసనము. అతనికీ ఏతత్కావ్యపఠితలకూ కూడా అన్వయించేదే. కవి రచించబోయే కావ్యంకూడా అమృతంవలె మధురమూ, జీవశక్తిప్రదమూ అయి తన మనోభావనలను సమగ్రంగానూ, స్పష్టంగానూ, ప్రతిఫలింపం జేసేదిగా ఉండాలి. పఠితలు వాటిని తిన్నగా గ్రహించి ఆనందానుభూతిని పొందాలి అని ధ్వని.

మున్ముందు కావ్యంలో మంజువాణీ దౌత్యంలో గిరికాధృతమైన మౌక్తికహారానికి కల ప్రాముఖ్యాన్ని కూడా రమణీయాక్షసరాకృతి అనే సమాసం సూచిస్తున్నది.

## 28

ఏ దే నొక్క పురంధ్రి గానసుధచే హేలా కరాంభోజ వీ
ణా దండం చిగురించెనా నఖరుచుల్ నర్తింప మ్రోయించు న
య్యాది బ్రహ్మ ముఖాగ్ర రంగనటి విద్యాబుద్ధి సంసిద్ధి మా
నాదిండ్లప్పని కిచ్చుఁగాత హృదయానందంబు సంధిల్లగన్.

మాదయగారి మల్లన కృతి ఐన రాజశేఖరచరిత్రలోని సరస్వతీస్తవం ఈ పద్యం.

సరస్వతీదేవి వీణ మ్రోయిస్తూ ఉండగా ఆమె నఖకాంతులు వీణపై ప్రసరించి వీణాదండము చిగురించెనేమో అన్నట్లు తోస్తున్నది. కారణం? ఆమె గానము కేవలం గానముకాదు. అది సుధ. అమృతస్పర్శవల్ల మ్రోళ్ళుకూడా చిగురించడం సహజమే. అందులో ఆశ్చర్యం ఏమి లేదు. దీనిలో కవి తన కావ్యగుణం కూడా స్ఫురింపచేసినట్లయింది. తన కావ్యం సహృదయులైన పండితుల మనస్సులనే కాకుండా కావ్యానుశీలన అభ్యసనాదికం లేని సాధారణుల హృదయాల్ని కూడా రసార్ద్రం చేయగలదు. మ్రోళ్లవంటి మనస్సుల్ని కూడా ఈ రాజశేఖర చరిత్రం చిగురింపచేయగలదు-అని మల్లన విశ్వాసం. ఆమె నఖరుచులు ఆమె హేలా కరాంభోజ మందలి వీణాదండంమీద నర్తిస్తున్నవి. సరస్వతి ఆదిబ్రహ్మయొక్క ముఖాగ్రమనే రంగస్థలాన నర్తించే నటి.

## 29

**కద్రూజాంగదు తోడఁబుట్టువు శరత్కాదంబినీ చంద్రికా**
**చిద్రూపాంచిత పద్మగర్భముఖ రాజీవావళీహంసి వ**
**ర్ణ ద్రాక్షాఫలకీరి శారద కృపన్ రామానుజామాత్యు వే**
**దాద్రి స్వామికి నిచ్చు నిచ్చలును విద్యాబుద్ధి వాక్సిద్ధులన్. 14-**

ఈ పద్యం తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యం లోనిది.

కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు అన్నారు-"ఇతరుల కావ్యములనుండి మంచి పద్యము లెన్నుకోవలయును. ఈయన కావ్యములో ప్రతిచోటనూ మంచి పద్యములే" అని. మఱి ఇది మాత్రం మంచి పద్యమెందుకు కాదు? కద్రూజుడు వాసుకి; అతనిని అంగదముగా ధరించినవాడు శివుడు. సరస్వతి అతని తోడబుట్టువు. సరస్వతీ పరమేశ్వరులు బ్రహ్మకు అపత్యాలని పురాణ ప్రసిద్ధి. ఐతే వీరి ఈ తోబుట్టువుతనం ఇంతమాత్రంతోనే కాదేమో. శివుడూ తెలుపే, సరస్వతీ తెలుపే. కనుక ఈ విషయంలోనూ వారు ఇద్దరూ తోబుట్టువులే. ఈ తరువాత సమాసం ఈ విషయాన్నే ధృఢపరుస్తున్నది. ఆమె శరత్కాలంలోని మేఘమాలనూ అదే శరత్కాలంలోని చంద్రికనూ జయించిన రూపంతో- దేహకాంతితో - ప్రకాశి స్తున్నది. పద్మగర్భుని ముఖాలనే పద్మసమూహం దగ్గర క్రీడించే హంసి సరస్వతి. బ్రహ్మదేవుని నాలుగు ముఖాలనుంచీ వెలువడే వేదాది వాఙ్మయం వాగ్రూపం. ఆ వాక్కులకు అధిదేవత శారదయే. ఆమె వర్ణాలనే ద్రాక్షాఫల మధురరసాన్ని ఆస్వాదన చేసే కీరి-శుకాంగన. వర్ణగ్రంథితం పదజాలం. అటువంటి పదజాలంతో నిష్పన్నమయ్యే రసాత్మక వాక్యం కావ్యం "వాక్యం రసాత్మకం కావ్యమ్" "కవేః కర్మకావ్యమ్". "కవయతి-వర్ణయతి-ఇతి కవిః" కావ్యగత వర్ణనం శారదాదేవి యొక్క రూప పరిణామ విశేషమే. వర్ణాల కూర్పుతో ఏర్పడ్డ సంగీతానికి అదిదేవత కూడా సరస్వతియే. "సంగీతమపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయమ్", అని అభియుక్తోక్తి' ఇటువంటి శారద పాండురంగమాహాత్మ్య కృతిపతి ఐన విరూరి వేదాద్రిమంత్రికి విద్యాబుద్ధి వాక్కులు మూడూ సిద్ధింపజేయాలని కవి చేసే శుభాశంస. ఈ ఆశీస్సు ఆ కృతిపతికి ఒక్కడికే సంబంధించింది కాదు. కవికీ కావ్యపఠితలకూ

అందరికీ సంబంధించినదీను, ఈ పద్యంలోని "పద్మముఖ రాజీవావళీ హంసి' అనే సమాసం దండియొక్క కావ్యాదర్శంలోని "చతుర్ముఖముఖాంభోజవనహంస వధూః" అనే సమాసానికి రూపాంతరం. రామకృష్ణుని కూర్పులో ఆ సమాసం ఒక భారీతనాన్ని సంతరించుకొన్నది. ఇదే శ్లోకంలో దండి సరస్వతిని "సర్వశుక్ల" అన్నాడు. రామకృష్ణుడు కూడా ఈ పద్యంలో ఆమెను అట్లాగే వర్ణించాడు. ఆయన వ్రాయబోతున్న ఈ కావ్యంలో గూడా ప్రతిపాద్యుడు పాండురంగడు. అనంత కరుణా ధవళాంతరంగుడు. ఈ పొందిక ఎంతో సమంజసం.

## 30

**ఏ నాతి కొక గుబ్బ గానశాస్త్రంబు రెం**
**డవ గుబ్బ సాహితీ డంబరంబు**
**ఏ నాతి యిలు సత్కవీశాననంబు రెం**
**డవ యిలు చతురాననాననంబు**
**ఏ నాతి ప్రియశిష్యుడౌ నాకుసంభవుం**
**డటు మీది శిష్యుండు వ్యాసమౌని**
**ఏ నాతి పుత్రు లయ్యేద్యువరు మునులు దే**
**వ మనుష్యులెల్లరు పౌత్రభూతు**

**లట్టి జగదేక సామ్రాజ్య మధిగమించి**
**వీణ చేఁబూని పాట గావించి మగని**
**గరఁగఁజేసెడి యవ్వాణి వరము లొసఁగు**
**రాజహితుఁడగు వేంకటరత్నమణికి.** 1-3

కింకవీంద్రఘటాపంచాననులు-శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు రచించిన సరసకావ్యం శ్రవణానందంలోని సరస్వతీ స్తుతి ఇది.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్ " అన్న అభియుక్తోక్తి ననుసరించి మొదటిపాదం నడిచింది. వైదిక లౌకిక వాఙ్మయం అంతా సరస్వతీ రూపవిశేషమే. ఆమెయొక్క విరాడ్రూపమే. కనుకనే ఆమెకు ఒక ఇల్లు సత్కవీశుల ముఖాలు. రెండవ ఇల్లు బ్రహ్మదేవుని నాలుగు మొగాలు. సరస్వతి

అనుగ్రహించినందుననే క్రౌంచ ద్వంద్వవియోగ దర్శనజనితమైన శోకంతో సంతప్తుడైన వాల్మీకి నోట "మా నిషాద" ఇత్యాది శ్లోకం వెలువడింది. ఆ విషయమే చతురాననుడు తరువాత ఆయనకు తెలిపి అటువంటి శ్లోకాలతోనే రామకథను రచింవచేసి అతనిని ఆదికవినిగా చేశాడు. ఈ విషయంవే ఆనందవర్ధనాచార్యుడు"ఆదికవేః పురా క్రౌంచద్వంద్వ వియోగోత్థః శోకః శ్లోకత్వమాగతః" అని చెప్పి ఉన్నాడు. ఈ విధంగా నాకువు నుండి-అనగా వల్మీకము నుండి-పుట్టిన కవి సరస్వతికి మొదటి శిష్యుడైనాడు. అటమీది శిష్యుడు వ్యాసమౌని.

"వీనుల తేనెయై కురియు వింతగు కావ్యరసంబు గ్రోలి య
మ్మానవకోటికిం బశుసమానత మానఁగఁజేసి నెవ్వఁ డె
వ్వానికి నీడు లేరు మునివర్గములోపల నమ్మహాత్ము మే
ధానిధి నాద్యు రాఘవ కథానిధి కీర్తిధురీణుఁ గొల్చెదన్."

"వేదమునచ్చుకట్టి శ్రుతివీథుల తత్త్వము బట్టి చూచి య
వ్వేదము కంపు వీనులకు వెగ్గలమై నిగుడంగఁ బాటు నా
మోదము వెల్లిగొల్పి యనుమోదిత కీర్తుల మిన్ను దాకు న
య్యాదిమ పండితుం గొలుతు నచ్యుతమూర్తిఁ బరాశరాత్మజున్."

అని ప్రబంధపరమేశ్వరుడు వీరిని ప్రశంసించాడు. "ద్విత్రాః పంచషా వా కవయో భవంతి" అని అభియుక్తులు వ్రేళ్ళమీద లెక్కించి విడచిన కొద్దిమందిలో విడువరానివారు వీరిద్దరూనూ. అటువంటివారు సరస్వతీ శిష్యులుకాక సామాన్యులా మరి. మరీచ్యాది సప్త ప్రజాపతులు బ్రహ్మమానస పుత్రులు కాబట్టి సరస్వతికి పుత్రులే. వారినుండి వృద్ధిపొందిన మనుజులెల్లరు అమెకు మనుమలు. సరస్వతియొక్క ఇటువంటి వీణాగాన ప్రియమైనస్వరూపం ఇక్కడ కవికి ఉపాస్యం. కవిత్వం ఆలోచనామృతం. కాని సంగీతం అపాత మధురం. వెలయాలి వలపుకూడా అంతే. అది ఇల్లాలి పాతివ్రత్య పవిత్రత భక్తిభావంతో శబలితం కాదు. అటువంటి వేశ్యవలవును నమ్మి బోల్తాపడి పశ్చాత్తాపతప్తుడైన మధుసూదనుడు ఈ కావ్యంలో నాయకుడు అని ఈ పద్యంలో సూచితమౌతున్నది.

## 31

కఠినస్తనోపరి గ్రైవేయమణికాంతి
  కర్ణతాటంకంబు గాడి పఱుప
క్రమనితంబాగ్ర కాంచి కింకిణులతోఁ
  గరకంకణధ్వనుల్ కలఁతఁబూన
మౌళిక్లుప్త శశాంకమాలాతపములపై
  ఫాలస్థలీ జ్యోతి పాఱువెట్టఁ
దత్కాల విచలితాధరహాస మాధుర్య
  మాత్మ ప్రసన్నత నగడు పఱుప

పాలితోన్యోన్యలంఘన స్పర్ధములును
జాలితాన్యోన్య సౌందర్య సరసములును
నైన పలుకుల కూడిక యనఁగ నొప్పు
శారదామూర్తి నా యెదఁ జాలుగాక.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు రామాయణకల్పవృక్షంలో చేసిన శారదస్తుతి యిది.

సరస్వతీ స్తనద్వయంపైనున్నఁ గ్రై వేయమణిహారాల కాంతి కర్ణతాటంకాలను గాడిపరుస్తున్నదట. అంటే సంగీత సాహిత్య వైభవం శ్రవణానందదాయక మౌతుందని భావం. నితంబభాగంలోనున్న కాంచీ కింకిణులు కరకంకణ ధ్వనులతో వాదుకు దిగినాయట! గతి సౌందర్యం తాళ లయాశ్రితమయినప్పుడు కవితలో రాగమాధుర్య మేర్పడగలదని వ్యంగ్యం. మౌళిపైనున్న చంద్రరేఖ కాంతిపై ఫాలస్థలంలో నున్న జ్యోతిఃప్రకాశం దాడి చేస్తున్నదట! కవితలో హృదయాహ్లాదజనకమయిన ఉపరంజనమెంత ఉండాలో జ్ఞానకాంతులను ప్రకాశింపచేసే ఉపదేశంకూడా అంత ఉండాలని తాత్పర్యం. హాసమాధుర్యాన్ని ఆత్మప్రసన్నత నగడు పెట్టినదట! రచనలో తత్తత్కాలోచితమైన రచనామాధుర్యం

కావ్య ప్రసన్నతను మించి భాసించునన్నది వ్యంగ్యం. పలుకులలో అన్యోన్యలంఘన స్పర్ధ అన్యోన్య సౌందర్యసరస స్పర్ధ కనపడు తున్నదట; ప్రత్యక్షర రామణీయకమైన రచన, రమణీయార్థ ప్రతిపాదక శబ్దరూపమైన కావ్యం శారదారూపమని విశ్వనాథ వారి భావం.

వాగ్రూపమైన శారదకు నమోవాకములు!

**ఇతి శివమ్.**